# పాణినీయము - కావ్యవాఙ్మయము

అను

భాషావిషయపరిశోధకవ్యాససంపుటము





పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# పాణినీయము - కావ్యవాఙ్మయము

గ్రంథకర్త:

ఉభయభాషాప్రవీణ

వ్యాకరణ విద్యాప్రవీణ

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

మద్రాసు

ఆనంద ముద్రణాలయమున

ముద్రితము

1944

# తొలిపలుకు



పాణినీయము - కావ్యవాఙ్మయము అను నీ గ్రంథము భాషావిషయపరిశోధకములగు ననేక వ్యాసములతో నిండియున్నది. పాణినీయమును, గావ్యవాఙ్మయమును గూర్చిన చర్చ యిందుఁ బ్రధానముగా నుండుటచే గ్రంథకర్త దీనికీ నామ మిడెను. ఇందు మూఁడు ప్రకరణములు గలవు. (1) పాణినీయపరిశోధనము, (2) మహాకవిప్రయోగసాధనము, (3) అనుబంధపరామర్శము - అనునవి ఆ యా ప్రకరణములలో శీర్షికములును నవాంతరశీర్షికములును పెక్కులు గలవు. దీనిని రచించినవారు పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఈ గ్రంథమున వజ్ఝలవారి వాదఖండనము నిమిత్తమాత్రమే గాని భాషావిషయ పరిశోధనదృష్టియే మొట్టమొదటినుండి తుట్టతుదవఱకును గ్రంథకర్తల లక్ష్యపథమున స్థిరముగా నిలిచియున్నది ఈపరిశోధనము మూలమున కని విని యెఱుఁగని యపూర్వవిషయముల నెన్నిటినో లోకమునకు వీరు వెల్లడించిరి; సారస్వత విజ్ఞానమును బెంపొందఁ జేసిరి ఈ పొత్తమున గ్రంథరచయితలు చర్చించిన విషయములన్నియును చాలవఱకు సంస్కృతాంధ్రభాషలకు రెండిటికిని సంబంధించిన సామాన్యవిషయములుగా నున్నవి. ప్రత్యేకమాంధ్రభాషా విషయముగా శైవకవుల ప్రామాణ్యము మొదలగువిషయములుగూడ సందర్భానుగుణముగా నక్కడక్కడ జర్చింపఁ

బడినవి సంస్కృతాంధ్రకవులు సంస్కృతమహాకావ్యముల లోను, భారతాద్యాంధ్ర గ్రంథములయందును బ్రయోగించిన 'కంబుకంఠి' 'మీననేత్రి' 'సుగాత్రి' మున్నగువాని నపార మగు పరిశ్రమముతో, విపులమగు పరిశోధనముతోఁ దగు ప్రమాణములఁ బ్రదర్శించి సాధువులని శ్రీ శాస్త్రిగారు నిరూపించిరి, సంస్కృతాంధ్ర మహాకవుల ప్రజ్ఞావిశేష మెట్టిదియో మేలోళ్ళఁ జాటిచెప్పిరి దీనిమూలమున శ్రీనాథాదులు నాఁడు తమ విజ్ఞానవికాసముచేఁ బ్రయోగించిన యీ ప్రయోగవిశేషములను దప్పులని దిద్ద సాహసించుచున్న నేఁటి విమర్శక లోకమునుండియు, వీని నాధారముగాఁ గొని యాకాశసౌధములను నిర్మింపఁ గడఁగుచున్న పరిశోధక దృష్టిపథమునుండి యుఁ దొలఁగించి యమూల్యమగు నాంధ్రభాషా విజ్ఞానసర్వస్వము ను శ్రీ శాస్త్రిగా రుద్ధరించిరి, తమ మాతృఋణమును దీర్చి కొనిరి ఈ గ్రంథనిర్మాత లిదివఱలోనే 'శ్రీనాథాదుల ప్రయోగ విశేషములఁ గూర్చియు నాంధ్రమహాభారతాదులలోని యఖండ యత్యాదుల గుఱించియుఁ బత్రికా మూలమునఁ దమకూలంకష మగు పరిశోధన ప్రజ్ఞా విశేష మును వెల్లడించి లోకమునకుఁ గృతపరిచయులయియే యున్నారు వీరు ప్రాచీన సంప్రదాయము చొప్పున గురుకులావాసముచేసి చక్కఁగా విద్య నభ్యసించిన పండితోత్తములు ఇట్టివారికి సంస్కృతాంధ్ర పాండిత్యమునకుఁ దోడుగ నుభయభాషా పరిశోధనప్రావీణ్య మలవడుట సువర్ణమునకుఁ దావి యబ్బుట యని వేఱుగాఁ జెప్ప నక్కఱ లేదు. ఇదిగాక యుభయభాషలలోను శ్రీ శాస్త్రులుగారు చక్కని

కవిత్వము వ్రాయఁగల కవులు సమర్థులగు నిట్టి కోవిదరత్నముల కాంధ్రభాషా పరిశోధనమునకుఁ దగునవకాశ మేర్పడిననేగాని యాంధ్రవిజ్ఞానము నవ్యవికాసములతో, నవనవోత్తేజములతో ప్రభావంతమై దేదీప్యమానము కాఁజాల దని నా నమ్మకము

మదరాసు.
1-1-1944

వెదురుమూడి కృష్ణరావు
గవర్నమెంటు సీనియరు తెలుఁగు ట్రాన్సులేటరు.

# పీఠిక

ఆంధ్రభాషోద్ధారకుఁడగు నన్నయ 'ఆంధ్రశబ్ద చింతామణి' అనుపేర నాంధ్రభాష కొకవ్యాకరణమును వ్రాసెను శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు దానిలోని విషయముల ననేకములఁ బరిశోధించి లోకమున కెఱుకపఱచిరి దీనికి 'చింతామణివిషయపరిశోధన' మని పేరు దీనిలోని ద్వితీయభాగమున నానుషంగికముగా సంస్కృతవైయాకరణుల ప్రసక్తి యేర్పడినది ఆ సందర్భమున శ్రీ శాస్త్రిగా రిట్లు వ్రాసిరి. "పాణినీయమునాఁటికి సంస్కృతమున వ్యావహారిక భాష, వేదభాష శిష్టవ్యవహారభాష—అను మూఁడుభాషలు గలవు శిష్టులు వైదికకర్మములలో వ్యవహరించెడుభాషకు 'శిష్టవ్యవహారభాష' అని పేరు ఈ భాషకే మునిత్రయము వారు, (పాణిని, కాత్యాయన, పతంజలులు) అనుశాసనమును (వ్యాకరణమును) వ్రాసిరి కావుననే తమనాఁటికిఁ బ్రసిద్ధముగానున్న భారతరామాయణాదిగ్రంథస్థ ప్రయోగము లేవియు మహాభాష్యాదులలో మునిత్రయమువారు సాధించినవారు కారు ఈ గ్రంథములలోని వేనవేలుప్రయోగములు పాణినీయమునకు సరిపడకున్నవి. పాణిని యనుశాసించిన భాష శిష్టవ్యవహారభాషయే యైనను దనసూత్రములుమాత్ర మాతఁడు వ్యావహారికభాషలోనే వ్రాసినాఁడు కావుననే 'సూత్ర

త్వాత్సాధువులు' (పమాదములు) అనఁదగు ప్రయోగము లనే
కము లీతనిభాషలోఁ గనఁబడుచున్నవి. పాణినీయమున సాధిం
చిన ప్రయోగము లనేకములు ('పుపుతిత్రీయియుషిమతి'వం
టివి) రామాయణాదులలో నగపడకున్నవి తరువాతి మహా
కవులు కాళిదాసాదు లైనను బాణినీయము శిష్టవ్యవహార
భాషానుశాసక మని దానిని ద్రోసి పుచ్చి యాదరింపకయే
తమకావ్యములను వ్రాసిరి కనుకనే వీరిప్రయోగము లనేక
ములు పాణినీయమునకు లొంగకున్నవి (చూ చింతా ద్వితీ
యభాగము) ఈ వాదమున కింతటికిని మహాభాష్యమే
ప్రమాణము ఈ రహస్యమును గుర్తెఱుఁగక తరువాతి
వైయాకరణులు పాణినీయమునకును గావ్యభాషకును సంబం
ధము కలదని తలఁచి యస్వరసములగు మార్గములతో మహా
కవిప్రయోగముల సాధింపఁ బ్రయత్నపడిరి" ఈ గ్రంథము
విశ్వవిద్యాలయమువారిచే 'ఉభయభాషాప్రవీణ' పరీక్షకు
నాఁడు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపఁబడినదిగాన యీ కాల
మునఁబరీక్షార్థియగు నా కా గ్రంథము సాకల్యముగా సవిమర్శ
ముగాఁ బఠించుభాగ్య మబ్బినది భాషాసేవయే జీవితపరమా
వధిగాఁ గల నాకు నాఁటినుండియు మహాభాష్య మేమాత్రము
నంగీకరింపక యుక్తివాదమునకు సయితము కడుదూరమైన
వీరివాదము న్యాయదూర మని లోకమున కెఱిఁగించుకొనవల
సిన యావశ్యకత యేర్పడినది తరువాతఁ గొలఁదికాలమునకు
'కాకినాడపురము'న 'ఆంధ్రసాహిత్య పరిషద్రజత మహోత్స
వము' జరగినది. శ్రీ శ్రీ జయపురసంస్థానాధీశ్వరులు శ్రీ విక్ర
మదేవవర్మ మహారాజులు దాని కధ్యక్షులుగా వేంచేసిరి ఆ

మహాసభలో 'మహాభాష్యమును' 'మహాకావ్యవాఙ్మయ' మును సంపూర్ణముగాఁ బరిశోధించి శ్రీ శాస్త్రిగారివాదము సరిగా దని నిరూపించిన నా వ్యాసవిషయములనుగూర్చి యు పన్యసించితిని కాని యవకాశము కొలఁదిగాఁ గల నాకు నాఁటి సభామధ్యమున విషయములన్నియు విపులములుగాఁ దగు రీతిని విమర్శించిచెప్పుట కవకాశ మేర్పడినది కాదు ఆ పైని (7-10-37 7-11-37) భారతీపత్త్రికలలో 'పాణినీయము-కా వ్యభాష' అను శీర్షకముతో నావ్యాసములను రెండుభాగ ములుగా మొట్టమొదటఁ బ్రకటించితిని వానినే యిప్పుడు పాణినీయపరిశోధన మను పేరఁ బ్రచురించితిని విషయపరిశోధన కర్తలు గ్రంథపునర్ముద్రణావసరమున వీనికి ఖండనముగాఁ దరువాత నొకయనుబంధమును బ్రచురించిరి దానిలోఁ బ్రస క్తానుప్రసక్తముగా మఱికొన్ని విషయములనుగూడ శ్రీ శా స్త్రిగారు ముచ్చటించిరి పాణినీయమునాఁటికిఁ గావ్యవాఙ్మ యమే యశ్రుతచర మనిరి సంస్కృతము సర్వజనవ్యవహార భాషగా నుండుట యసంభవ మనిరి 'పుపుత్త్రియియిషతి' వంటిరూపముల సాధించిన పాణినీయమునకును గావ్యభాష కును సంబంధ మేమనిరి కవులకుఁ బ్రమాదములే కలుగవనిరి 'వాకోవాక్యమితిహాసఃపురాణం ' అను మహాభాష్యము లక్ష్యవాఙ్మయప్రదర్శకము కాదనిరి మహాభాష్యము మహా కవిప్రయోగముల నిరాకరించినది కాని సాధించినది కా ద నిరి వీనికన్నిటికిని నాయాశీర్షకములక్రిందఁ దగుప్రమాణ ములతోఁ దగినరీతిని సమాధాన మొసఁగి యవి యట్టివి కా

వని నిరూపించినాను ఈ భాగమున 'కనుబంధపరామర్శ మను పేరిడినాను ఇదిగాక, చింతామణివిషయపరిశోధన మునఁ గావ్యభాషకుఁ బాణినీయమునకు నెట్టిసంబంధము లేదని నిరూపించుటకుఁ బదునొకండు మహాకావ్యప్రయోగములను శ్రీ శాస్త్రిగారు ప్రదర్శించిరి. ఇవి వీరిసిద్ధాంతమునకు మూలాధారములు ఈ కవిప్రయోగములన్నియుఁ బాణినీయములే యనియు మహాకావ్యములను మహాభాష్యమును జక్కఁగాఁ బరిశోధించి యివి యిట్టివని యెఱుఁగకపోవుట మనలోపమే యనియు సవిమర్శనముగా వ్రాసితిని ఈ భాగమునకు 'మహాకవిప్రయోగసాధన' మనిపేరు ఇఁక నా సిద్ధాంతములోని ప్రధానవిషయములు సులభముగాఁ బాఠకుల కవగతమగుటకు వానినిగూడ నిట సంగ్రహముగాఁ బేర్కొనెదను

కవులకు వ్యాకరణపరిచయ మావశ్యకమని కవులే యనినారు నాఁడు వారు పఠించిన వ్యాకరణము పాణినీయ మని వారివాక్యములే విశదీకరించుచున్నవి (చూ కవులు - పాణినీయపరిచయము) ప్రమాదములు (అపశబ్దములు మొ) తమకుఁ గలవని కవులే యొప్పికొనినారు క్షేమేంద్రాదులు 'ఔచిత్యవిచారచర్చా'ది గ్రంథములలో దమకుఁ బ్రమాదము లున్నవని తమకావ్యములనుండి తమప్రయోగములను దామే చ్యుతసంస్కృతి మొదలగు దోషముల కుదాహరణములుగా నొసఁగిరి (చూ. 'కవులు - ప్రమాదములు' అను శీర్షకము) కావునఁ గావ్యములలో నపశబ్దములు సాధుశబ్దములునుగూడఁ గల వనుటకు సందేహములేదు ఇట్టిచోఁ గావ్యభాషానుశాసక మగు వ్యాకరణము చేయవలసిన కృత్యములు

రెండు. (1) అపశబ్దము లివి యని నిరూపించి యివి ప్రయో
గార్హములు కావని నిరాకరించుట. (2) సాధుశబ్దము లివి
యని నిర్ధారణము చేసి యవి ప్రయోగార్హము లని యనుశాసిం
చుట కావుననే మహాభాష్యకర్త 'ఛందోవత్కవయః కుర్వ
న్తి. వహ్యాపాశ్లిష్టిః' అని కవులలోని యపశబ్దములను నిరాక
రించెను 'వరతను సంప్రవదన్తి కుక్కుటాః (జానకీహరణము-
కుమారదాసుఁడు), 'ఉపగాత్కృతకాలాపం, ప్రత్యష్ఠాత్కట
ఠాధుమమ్'', 'ఏతి జీవన్తమానన్దో నరం వర్షశతాదపి' (రామా
యణము - వాల్మీకి) మొదలగు మహాకావ్యప్రయోగములననే
కములఁ జర్చాపూర్వకముగ సాధువులని సాధించినాఁడు
(చూ. అనుబంధపరామృశ్యములోని మహాకవి ప్రయోగసాధ
నము - మహాభాష్యఫక్కి) కావునఁ గావ్యభాషానుశాస
కము పాణినీయ మనక తీఱదు పాణినినాఁటికి దృశ్యకావ్యములు
నయితము కలవు రూపకభేదప్రతిపాదక మగు 'నాటికా' శబ్ద
ము నితఁడు సాధించుట మొదలగునవి యెన్నియో దీనికి నిద
ర్శనములు. (చూ. అనుబంధపరామర్శము, పాణినీయము-
నాఁటి కావ్యవాఙ్మయము). ఇవిగాక వరరుచి 'వారరుచ' మను
కావ్యము వ్రాయుట మొదలగు ననేకవిషయము లీశీర్షిక
మునఁ జర్చింపఁబడినవి ఇఁక వీరు పాణినీయము సాధించిన
దనిన శిష్టవ్యవహారభాష గగనకుసుమాయమానము వీ
రుదాహరించిన మహాభాష్యము లేవియు శిష్టవ్యవహారభాష
కల దనుట లేదు సంస్కృతము సర్వజనవ్యవహారభాష గా
నున్న దనక తప్పదు. అపశబ్దప్రయోగ మాక్షేపాదకము—
ఈ విషయములు చాలవఱకుఁ 'పాణినీయపరిశోధన' -మను

మొట్టమొదటి ప్రకరణమున విమర్శించితిని ఈ గ్రంథమం తయుఁ బాలవఱకు భాషావిషయ పరిశోధక వ్యాసములుగా భారతీ పరిషత్పత్రికలలో నిదివఱకుఁ బ్రకటింపఁబడినదియే. వీనినే యిప్పుడు గ్రంథప్రచురణమున కావశ్యకము లగు కొలఁది మార్పులతోఁ బ్రచురించితిని ఈ విమర్శనము మూల మున నపూర్వములగు ననేకగ్రంథములను మహాభాష్య మహాకావ్య వాఙ్మయములను జక్కఁగాఁ బరిశోధింపఁగలిగి తిని ఈ పరిశోధనముచే సంస్కృత ప్రాచీన కావ్యవాఙ్మయ మునుగూర్చియు, మునిత్రయమువారినిగుఱించియు విపుల ముగా నొకమహా గ్రంథము వ్రాయవలసిన యావశ్యకతయు వానికిఁ దగునాధారములును నాకు లభించినవి' పరమేశ్వరుని యనుగ్రహముచే నివియన్నియుఁ బారకలోకమున కచిరకాల ములోనే యందఁజేయఁగల నని విశ్వసించుచున్నాను గుణజ్ఞు లగు విద్వాంసులు సమగ్రముగా నా పరిశోధనము నవలో కించి నా పడిన పరిశ్రమము సఫలమొనర్తురుగాక యనియు, "పాణినీయము - నాఁటికావ్యవాఙ్మయము, కవులు - పాణి నీయపరిచయము, మహాకవిప్రయోగములు - మహాభాష్య ఫక్కి, కవులు-ప్రమాదములు - అనుశీర్షకములును మహాకవి ప్రయోగసాధనములోని లుజ్ లఙ్ఞాది ప్రయోగములు-పాణినీ యము, వ్యధికరణబహువ్రీహి-పాణినీయము, ఛాందసప్రయో గములు- తత్సాధనము' - అనునవియును నిందుఁ బ్రధాన ముగాఁ' జిత్తగింపవలయుననియును మనవిచేయుచున్నాను సమగ్ర మహాభాష్యమును, మహాకావ్యములను జక్కఁగా నీ విమర్శనము మూలమునఁ బరిశోధింపఁజేసి యనేకాపూర్వ

విషయములఁ దెలిసికొనఁజేసిన శ్రీ శాస్త్రిగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను ప్రప్రథమమున వీనిని వ్యాసరూపముగాఁ జాల వఱకు ముద్రింప సహాయపడిన భారతీ, పరిషత్పత్త్రికాధి పతులకును, నేఁటిగ్రంథ ప్రచురణమునకుఁ దోడుపడిన 'ఆర్. వేంకటేశ్వర అండ్ కంపెని'వారికిని నా యభివందన ములఁ దెలిపికొనుచున్నాను

ఇట్లు
గ్రంథకర్త



# విషయసూచిక

## I పాణినీయ పరిశోధనము

# పాణినీయము - కావ్యవాఙ్మయము

## పాణినీయ పరిశోధనము

---

బ్ర శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు తాము రచించిన చింతామణివిషయపరిశోధనమునఁ బాణినీయము కావ్యభాషానుశాసకము కాదనియుఁ దదనుశాసకమగు మఱియొక వ్యాకరణ మావశ్యకమనియు నొక పరమ సిద్ధాంతమును బ్రకటించిరి. దాని కనుకూలముగా మఱికొన్ని సిద్ధాంతములనుగూడ నేర్పఱచిరి వీని కన్నింటికిని మహాభాష్యమే ప్రమాణమనియు నుదాహరించిరి నే నెంతయో కుతూహలపడి యది యంతయు విమర్శనాదృష్టితోఁ బరిశోధించి చూచితిని కాని నా కవి న్యాయసమ్మతములు కావని తోఁచుటచేఁ దత్త్వజిజ్ఞాసువునై నే నీ వ్యాసమును బ్రకటించి యుంటిని.

### వ్యాకరణము శిష్టోపదేశమూలకము

'పృషోదరాదీని యథోపదిష్టమ్'

కైరుపదిష్టాః, శిష్టైః యది తర్హి శిష్టాశ్శబ్దేషు ప్రమాణం కిమష్టాధ్యాయ్యా క్రియతే శిష్టపరిజ్ఞానార్థాఽష్టాధ్యాయీ కథంపున రష్టాధ్యాయ్యా శిష్టాశ్శక్యా విజ్ఞాతుమ్

అష్టాధ్యాయీ మధీయానోఽన్యం పశ్య త్యనధీయానమ్ యేఽత్ర విహితా శ్శబ్దా స్తాన్ ప్రయుఞ్జానంపశ్యతి,

నూన మస్య దైవానుగ్రహ స్స్వభావోవా యోఽయం నచాఽష్టాధ్యాయీ మధీతే యేచాస్యాం విహితా శ్శబ్దా స్తాన్ ప్రయుఙ్క్తే నూనమయ మన్యానపి జానాతీతి ఏవ మేషా శిష్టపరిజ్ఞానార్థాఽష్టాధ్యాయీతి"

(మహాభాష్యము ౬ అధ్యా 3 పాద 3 ఆహ్ని.)

పై సూత్రభాష్యములను బట్టి బ్ర శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు పాణిని పతంజలుల కాలమున శిష్టవ్యవహారభాష యనునొకభాష ప్రత్యేకముగాఁ బ్రసిద్ధి వహించియుండెడిదనియు నద్దాని నాధారముగాఁ జేసికొనియే పాణినీయము రచింపఁబడినదనియు, నందుచే నాశాస్త్రమెల్లను శిష్టవ్యవహారభాషామాత్రానుశాసకమే యయి యున్న దనియు సిద్ధాంతీకరించిరి కాని పై సూత్ర భాష్యములను బరిశీలించి చూచినచో శ్రీ శాస్త్రిగారు వ్రాసినవిధముగా నా కాలమున శిష్టవ్యవహారభాష యను నొకభాష యుండె నను టకుఁ గాని, దాని నాధారముగాఁ జేసికొనియే పాణిని తన శాస్త్రమును రచించె ననుటకుఁగాని యేమాత్రమును పై సూత్రభాష్యములు ప్రమాణములై యుండలేదు భ్రమ ప్రమాదములకు లోనుగాని శిష్టోపదేశమును మాత్రము ప్రమాణీకరించికొని పాణినిమహర్షి తన శాస్త్రమును రచించె నని పై సూత్రభాష్యములు సుస్పష్టముగా నుద్ఘోషించుచు న్నవి ఒక్కపాణినీయ మననేల, ప్రతిశాస్త్రమును శిష్టసంప్ర దాయమును మూలముగాఁ గొనియే వ్రాయఁబడియున్నది. ఈ విషయమున ధర్మవ్యవస్థయే మనకుఁ బ్రబల నిదర్శనముగా

నున్నది ధర్మమున కేప్రకారముగా శిష్టాచారము మూల మనఁ దగియున్నదియో యావిధముగానే వ్యాకరణమునకును శిష్టోపదేశమే నిదానమని మన మంగీకరింపకతప్పదు శిష్టాచార మేరీతిని స్మృత్యనుమాపకమై ప్రమాణపదము నధిరోహించుచున్నదియో శిష్టోపదేశమును నారీతిగనే పూర్వపూర్వవ్యాకరణానుమాపకమై ప్రమాణ మగుచున్నది ఈ శిష్టాచారమనునది యేవిధముగాఁ గొందఱకు మాత్రమే యాచరణీయముగాను, మఱికొందఱ కనాచరణీయముగాను నేర్పఱపఁబడియుండలేదో యా విధముగానే యీ శిష్టసంప్రదాయ మనునదియుఁ గొందఱకు మాత్రమే యనుల్లంఘ్యముగాను మఱికొందఱ కుల్లంఘనీయముగాను నేర్పఱపఁబడియుండ లేదు కావున నెల్లవారలకును ధర్మవిషయమున శిష్టాచారము వలెనే భాషావిషయమున శిష్ట సంప్రదాయమును ననతిక్రమణీయమై యున్నదనుట సిద్ధాంతితము కావునఁ గవులైన నీ శిష్టసంప్రదాయము ననుసరించియే కావ్యములను విరచింప వలసినవా రగుచున్నారు ఈ పాణినీయ సాధ్యములు శిష్ట సంప్రదాయసిద్ధ శబ్దానతిరిక్తము లే యని పై భాష్యమే యుద్ఘోషించుచుండుటచేఁ బాణినీయమునుగూడఁ గవు లనుసరింపవల సినవా రనుట సుస్పష్టము శిష్టాచారము నుల్లంఘించినవారి యాచారముల నెట్లు దుష్టాచారములఁగాఁ బరిగణింతుమో యట్టులే శిష్టోపదేశమూలకమగు పాణినీయము నతిక్రమించిన కవిప్రయోగములు సయితము దుష్టము లనకతీరదు

"*ఛందోవత్కవయః కుర్వన్తి నహ్యేషా ఇష్టిః"

ఈ విషయమునే మహాభాష్యకర్త "యూస్త్ర్యాఖ్యౌ నదీ' అనుసూత్ర వ్యాఖ్యానావసరమున నొక కవి ప్రయోగమును ప్రమాణీకరించి శాస్త్రమునే కవు లనుసరింపవలయును గాని యవ్వారి ననుసరింపవలసినయావశ్యకత శాస్త్రమునకు లేదనియు, శాస్త్రము ననుసరింపని కవిప్రయోగము లసాధువులేయనియు "ఛందోవత్కవయః కుర్వన్తి నహ్యేషా ఇష్టిః" అని స్పష్టీకరించెను పైభాష్యమున "ఛందోవత్కవయఃకుర్వన్తి అనియుండుటచే 'ఛందసి దృష్టానువిధిః' అనువాక్యము ననుసరించి కవు లేది ప్రయోగించిన నదియే పరమప్రమాణమనియుఁ దదనుశాసకమగు మఱియొక వ్యాకరణ మావశ్యకమనియు నెవ్వరేని భ్రమించెదరనియే కైయటుఁ డీక్రిందిరీతిని సుస్పష్టముగా వ్యాఖ్యానించెను 'నహ్యేషేతి' అసాధవ ఏ వైవమాదయః నతు తత్ప్రామాణ్యాత్ సాధుత్వవ్యవస్థా" అనఁగా "ఛందోవత్కవయః కుర్వన్తి" అనుదానికిఁ బైరీతి నర్థముచెప్పుట భాష్యాభిప్రేతము కాదనియుఁ గవులు పైని చెప్పినరీతిని శిష్టసంప్రదాయము ననుసరింపవలసినవారేయయి నను ఛందస్సు మొదలగు కావ్యనియమములఁ బాటింపవలసిన వారుగూడ నగుటచే "అపి మాషం మషం కుర్యా చ్ఛందోభంగం న కారయేత్" తనురీతిని ప్రమాదమువలననో, కావ్యనియ

---

* ఈ శీర్షకమునుగుఱించిన వివరణము కొంత 'అనుబంధ పరామర్శములోని' మహాకవిప్రయోగసాధనము - మహాభాష్యఫక్కి' అను శీర్షకములోఁ గలదు

మానుసరణపరాయణతచేతనో యసాధుశబ్దములఁ బ్రయో గించి శిష్టసంప్రదాయ ముల్లంఘించి ప్రవర్తించుటయుఁ గలద నియు నట్టిప్రయోగములను బ్రమాణీకరించికొని శాస్త్ర వ్యవస్థ నేర్పఱచుటకు వీలులేదనియు, నట్టివి శాస్త్రానను గృహీతము లగుచో నసాధువులే యనియుఁ, గవులు నిరంకుశు లని చెప్పుటలోనే పై ఛందోదృష్టాంతము చూపఁబడిన దనియు, నట్టిఛందస్సు నన్నివిధముల దృష్టాంతీకరించుచో "నహ్యేషా ఇష్టిః" అనుభాష్య మసంగత మేయగుననియుఁ బై కైయటము నకుఁ దాత్పర్యమైయున్నది

పై భాష్య కైయటములనుబట్టి కవిప్రయోగములైన నెంతవఱకు శాస్త్రానుగృహీతములగునో యంతవఱకే ప్రమాణభూతములగుననియు నెప్పు డయ్యవి శాస్త్రము నను సరించియుండవో యప్పుడయ్యవి ప్రమాణములే కావనియు మనము నిర్ణయింపవచ్చునుగదా ఇఁకఁ గావ్యములలోఁ బాణి నీయాననుగృహీతములై యసాధువు లనఁదగునేప్రయోగ ములో కొన్నికలవని యవ్వానిని సాధించుటకుఁగా మఱియొక వ్యాకరణము గావలసియున్నదను శ్రీ. శాస్త్రిగారి వాదము నకు మన ముత్తరవాదులము గావలసిన యవసరము *లేదు.

## పాణినీయము కావ్యభాషానుశాసకము

ఇది యిటులుండ పై భాష్యకైయటములనే ప్రమాణీ కరించికొని పాణినీయము కావ్యభాషానుశాసకముగాదని శ్రీ

---

* ఇవియును బాణినీయసాధితములగు సాధుశబ్దములేయని 'మహా కవిప్రయోగసాధనము' అను ప్రకరణమున నిరూపింపఁబడినవి.

శాస్త్రిగారు వ్రాయసాహసించిరి మహాభాష్యధోరణి యటు లుండ శ్రీ శాస్త్రిగారి వాదమును గై యటుఁడైన నంగీకరిం చువాఁడగుచో గావ్యభాషానుశాసకమే కాని యీవ్యాకరణ మునుబట్టి వై రీతిని "అసాధవ ఏ వై వమాదయః" అని వ్రాసి యుండఁడు గదా ? భాష్యకారుఁడైనను "సోఽప్యదోషో భవతి" అని మఱలఁ దానాప్రయోగమును ("బ్రాహ్మణేభ్యః ప్రియాఖ్యేభ్యః" అనుదానిని) సమర్థించియే యుండఁడు

## మహాకవిప్రయోగములు-మహాభాష్యము

ఇంత యేల 'ఘుషి రవిశబ్దనే' అనుసూత్రమున "కి మేతస్యజ్ఞాపనే ప్రయోజనమ్, "మహీపాల వచశ్శ్రుత్వా జుఘుషుః పుష్యమాణవాః" అనియు "కర్మణోరోమన్థ తపో భ్యాం వర్తిచరోః' అనుసూత్రమున "కథం తపస్యతో లోకజిగీ షురగ్నేః' అనియు "ఉపాన్మన్త్రకరణే' మొదలగు సూత్ర ములలో "బహూనా మప్యచిత్తానా మేకోభవతి చిత్తవాన్, పశ్య వానర సైన్యేఽస్మిన్ య దర్కముపతిష్ఠతే' "మైనం మంస్థాస్స ఏషోఽపిహి యథావయమ్' "ఏతదప్యస్య కాపేయం యదర్కముపతిష్ఠతి" 'ఏతిజీవన్త మానన్దో నరం వర్ష శతాదపి' "వరతను సంప్రవదంతి కుక్కుటాః" 'జఘాన కంసంకిల వాసుదేవః" "అత్మమ్భరి శ్చరతి యూథ మసేవ మానః' "అసిద్వితీయోఽనుససార పార్థమ్" అనియు రామా యణాదులలోని ప్రయోగము లెన్నెన్నియో మహాభాష్యమున సాధింపఁబడియున్నవి (చూ అనుబంధపరామర్శము 'మహా కవిప్రయోగసాధనము - మహాభాష్య ఫక్కి' అను శీర్షకము)

ఇట్టి ప్రయోగసాధనమే పాణినీయము కావ్యభాషాను శాసకమని వేనోళ్ల నుద్ఘోషించుచున్నది

భాషావిభాగము ఆదరణీయముకాదు

ఇది యిట్లుండ శ్రీశాస్త్రిగారు "వైదిక కర్మోపయోగి శిష్టవ్యవహారభాష" యనియుఁ "గావ్యభాష" యనియు రెండుభాషలను బేర్కొని మొదటిదానికే పాణినీయ మను శాసకమై యున్నదనియు రెండవదానికిఁ బాణినీయ మనుశాసకమై యుండలేదనియు వ్రాసిచ్చిరి కాని పైని మేము చెప్పిన రీతిని గావ్యభాషయు శిష్ట సంప్రదాయమూలకమే యగుటచేఁ దదతిరిక్తముగాఁ గావ్యభాష యొకటి లేదనుట సిద్ధాంతితము కవు లాశిష్ట సంప్రదాయమునే మూలముగాఁ గొని వచ్చుచు మానవసహజ మగు భ్రమ ప్రమాదములవలన నెచ్చటనో యొకచోట శాస్త్రాననుగృహీతములగు ప్రయోగములను బ్రయోగించినయంతమాత్రమున నాభాష కొక వైలక్షణ్యము గలిగిన దనుకొని యది యొకభాషావిభాగముగా నంగీకరించి యద్దాని కొకవ్యాకరణము గావలయు ననుట న్యాయ్యముగాదు ఇట్లు సూక్ష్మసూక్ష్మభేదములను బుచ్చికొని భాషావిభాగము నేర్పఱుపఁదలఁచినచో సౌత్రభాషయనియు నార్షభాష యనియు శాస్త్రభాష యనియు నాటకభాష యనియుఁ బత్త్రికాభాష యనియు నెన్నెన్నియో విభాగములు కలుగవలసియుండును ఆయాభాషల కొక్కొక్క వ్యాకరణమును నావశ్యకమనవలసివచ్చును. చూ 'లౌకిక వైదికవాఙ్మయము-భేదకారణములు' శీర్షకము (అనుబంధపరామర్శము)

## కవి ప్రమాదములు

ఇదియేగాక 'వైదికకర్మోపయోగిభాష కె పాణినీయమనుశాసక మగునాఁడు తత్కర్మోపయోగి పదజాలమును మాత్రమే పాణినీయ మనుశాసింపవలసియుండ వైదికకర్మోపయోగిగాక లోకవ్యవహారములో సుప్రసిద్ధముగానున్న శబ్దజాతమును, రామాయణ భారతాది ప్రాచీన వాఙ్మయములోని 'దాశరథిః' 'కైకేయీ' 'దుర్యోధనః 'దుర్మర్షణః' మొదలుగాఁగల యనంతమగు పదజాతమును సాధింపనేల ? పోనిండు శ్రీశాస్త్రిగారు వ్రాసినట్లు మునిత్రయమువారు తమ నాఁటికే ప్రాచీనముగా నేర్పడియున్న కావ్య పురాణేతిహాసాదులలోని ప్రయోగముల ననేకముల సాధింపకుండుటచే నియ్యది తదనుశాసకముగాదని మన మంగీకరించెదమనినను నట్టి ప్రయోగము లేవియుఁ గానిపింపకున్నవి ఇఁక శాస్త్రిగారు తలఁచినట్టి 'సీతాయాఃపతయేనమః' మొదలగు (నార్షత్వాత్సాధువులనఁదగు) ప్రయోగములన్ననో ప్రమాదపతితములగుటచే మనకు గ్రాహ్యములు కావు ఆకవి యాగ్రంథమున నట్టి ('పతయే'వంటి) ప్రయోగములను దద్వ్యతిరిక్తములగు (శాస్త్రానుగృహీతములగు 'పత్యే'వంటి) ప్రయోగములను నెన్నిసారులు ప్రయోగించెనో మన మెంచి బహుళదృష్టితో వీక్షించినచో నట్టి (శాస్త్రాననుగృహీతములగు) ప్రయోగములేకొలఁదిగానో కానిపించుటయే మన కయ్యవి ప్రమాదపతితములనుటకు నిదర్శనము కానోపును ఏవి ప్రమాదపతితములో యవి గ్రాహ్యములుకావని పతంజలి భగవానుఁడే య స్త్వప్రమత్తగీత స్తత్ప్రమాణమ్" అని చెప్పియు

న్నాఁడు అనుబంధపరామర్శములోని 'కవులు - ప్రమాదములు' అను శీర్షకమునఁ గవులకుఁ బ్రమాదములు గలవని వివరింపఁబడినది

ఇట్టి స్థితిలో సకల భాషాపరిశోధకాగ్రేసరులగు సుప్రసిద్ధవైయాకరణులును సకల విద్యాపారంగతులగు నాలంకారిక శిరోమణులును, వివుతవాది దుర్వాదనిర్వాపణ పటిష్ఠులగు నైయాయిక చూడామణులును సాంగోపాంగ వేదవిజ్ఞాన సంపన్నులగు మీమాంసకోత్తములును, దత్త్వ నిర్ణాయకులగు వేదాంతవేత్తలును, మఱియు నెందఱో తదితరమతస్థులును పాణినీయము సకల సంస్కృతవాఙ్మయానుశాసక మని సుస్పష్టముగాఁ దమ గ్రంథములలో నాఁటినుండి నేఁటివఱకును నుద్ఘోషించుచుండ నవియెల్లను భ్రమమూలకమని వ్రాసిన వ్రాఁతలకు లోక *మాశ్చర్యపడవలసియున్నది

## వైదిక కర్మోపయోగి శిష్టవ్యవహార భాష

ఇఁక "పృషోదరాదీని యథోపదిష్టమ్' అను సూత్రమును దద్భాష్యమును మూలముగాఁ గొని తామేర్పఱచికొనిన 'శిష్ట వ్యవహారభాష' "యజ్ఞకర్మణి సనియమోఽన్యత్రానియమః, యాజ్ఞే కర్మణి పున ర్నాపభాష న్తే' (మహాభాష్యము ౧ అధ్యా ౧ పా. ౧ ఆహ్ని ) అను భాష్యమునుబట్టి వైదిక కర్మోపయోగిగాఁ గానిపించుచున్నదని తలంచి పై

* చూ - చిత్రము, విచిత్రము - అను శీర్షకములు (అనుబంధ పరామర్శము.)

నుదాహరించిన నామము శ్రీ శాస్త్రిగా రంగీకరించిరని మన
మూహింపవచ్చును

## అపశబ్దప్రయోగము ఆక్షేపాపాదకము

ఇదియేగాక "మ్లేచ్ఛా మాభూమేత్యధ్యేయం వ్యాకరణమ్. దుష్టాః శబ్దాః మా ప్రయుజ్క్ష్మహీ త్యధ్యేయం వ్యాకరణమ్ నమ్లేచ్ఛితవై, నాపభాషితవై, మ్లేచ్ఛోహవా ఏష యదపశబ్దః' మొదలగు వాక్యములను బురస్కరించుకొని కొందఱు "అపశబ్దం ప్రయుఞ్జానో రౌరవం నరకం వ్రజేత్తని కావ్యకర్తకు నరకదండమును విధించియుండిరనియు వా రుదాహరించిన పై ప్రమాణవాక్యములెల్లను "యజ్ఞకర్మణి స నియమోऽన్యత్రానియమః .. యర్వాణ స్తర్వాణో నామఋషయో బభూవుః ప్రత్యక్ష ధర్మాణః పరాపరజ్ఞాః విదితవేదితవ్యా అధిగతయాథాతథ్యాః, తే తత్రభవన్తః యద్వాన స్తద్వాన ఇతి ప్రయోక్తవ్యే యర్వాణ స్తర్వాణ ఇతి ప్రయుఞ్జతే, యాజ్ఞే పునః కర్మణి నాపభాషన్తే' అను భాష్యమునుబట్టి శ్రౌతస్మార్తాది పుణ్యకర్మవిషయకములే యగుటచే వారివాద మజ్ఞతామూలకమే యనియు వ్రాసిరి శాస్త్రిగా రీ భాష్యమును మాత్రమే యూతగాఁగొని వ్రాసిన వ్రాఁత లెంతవఱకు సమంజసములో విమర్శింతము. మహాభాష్యకర్త "ఏకశ్శబ్దస్సమ్యగ్జ్ఞాత శ్శాస్త్రాన్వితస్సుప్రయుక్తస్స్వర్గే లోకే కామధుగ్భవతి" అను శ్రుతికి నర్థనిర్ణాయకము లగు "జ్ఞానే ధర్మ ఇతిచే త్తథాऽధర్మః" మొదలగు వార్తికముల వ్యాఖ్యానించు సందర్భమున సాధు

శబ్దజ్ఞానముననే ధర్మము సిద్ధించునా, లేక సాధుశబ్దప్రయోగముననే తత్సిద్ధియా లేక శాస్త్రజ్ఞానపూర్వక సాధుశబ్ద ప్రయోగముననా యని విమర్శించుచు మొదటి రెండుపక్షములలోను దురుద్ధరములగు కొన్నిదోషములు గానిపించుచుండుటచే నయ్యవి సిద్ధాంతితములు గావని నిరాకరించి "శాస్త్రపూర్వకే ప్రయోగేఽభ్యుదయ స్తత్తుల్యం వేదశబ్దేన" అను వార్తికము ననుసరించి మూఁడవపక్షమునే సిద్ధాంతీకరించెను. తరువాత మరల 'అథవా పున రస్తు జ్ఞానఏవ ధర్మః అని చెప్పి మొదటఁ దాను సిద్ధాంతితములుగావని నిరాకరించిన పక్షములలో నొకటియగు 'జ్ఞానేధర్మః అను పక్షమునే మరల స్పృశించెను అప్పుడు పూర్వపక్షియుఁ దాను మొదటనుద్ఘాటించిన దోషములలో నొకటియగు "ఆచారే నియమః' అను దోషమును జూపించెను అప్పుడు దానిని సమర్థించుట కేవెరవును గానక భాష్యకారుఁ డీ పై భాష్యము నుదాహరించెను మొట్టమొదట దోషభూయిష్ఠమగుటచే సిద్ధాంతితమే కాదని నిరాకరించియు మరల నా పక్షమునే గ్రహించుటనుబట్టి పరిశీలించినచో "తుష్యతు దుర్జనః' అను న్యాయముననో, యీపక్షమునైనను మేము సమర్థించి నిలుపఁజాలుదు మను తమ యభినివేశమును వెల్లడించుటకుఁగానో తా నీపక్షము నుపన్యసించెనని తోఁపక పోదు "అథవా పునరస్తు జ్ఞాన ఏవ ధర్మః అను రచనయు దీనినే దృఢీకరింపఁజాలియున్నది అదియేగాక "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అను శ్రుత్యనుగృహీతమగు "సర్వత్రైవహివిజ్ఞానం సంస్కారిత్వేన గణ్యతే

పరాఙ్గం చాత్మవిజ్ఞానా దన్యత్రే త్యవధార్యతామ్" అను ప్రామాణికోక్తి ననుసరించి యాత్మవిజ్ఞానమునకంటె నతిరిక్తమగు విజ్ఞానమెల్లను పరాంగమై సంస్కారి గావలసియుండఁగా శ్రుత్యనుగృహీతమగు తత్ప్రామాణ్యమునుగూడ వదలి విజ్ఞానము నంగిగా నొనరించి సంస్కార్యముగాఁ జేయవలసి వచ్చుటయుఁ బై పక్షము సిద్ధాంతితము గాదనుటకు నిదర్శనమై యున్నది ఇదియేగాక జ్ఞానమాత్రమునకే యభ్యుదయకారిత్వ మంగీకరించుచో సర్వత్ర యనుష్ఠానమునకు వైయర్థ్యము తప్పకున్నది పై పక్షములకెల్లను మూలమగు 'ఏకశ్శబ్ద స్సమ్యగ్జ్ఞాత శ్శాస్త్రాన్విత స్సుష్ఠుప్రయుక్త స్స్వర్గేలోకే కామధుగ్భవతి' అను పై శ్రుతియు జ్ఞానపక్షమున విరోధించుచున్నది పై శ్రుతి 'సుష్ఠుప్రయుక్తః' అని చెప్పుచు సాధుశబ్దము సమ్యగ్జ్ఞాతమై శాస్త్రానుగృహీతముగాఁ బ్రయోగింపఁ బడునప్పుడే ధర్మజనకమగునని ముక్తకంఠముగా నుద్ఘోషించుచుండ సాధు శబ్దజ్ఞాన మాత్రమే యభ్యుదయ కారి యనుట యీశ్రుతికి విరుద్ధమనక తీరదు పోనిండు మొట్టమొదట భాష్యకర్త చూపిన మూఁడవపక్షము (సాధుశబ్దజ్ఞానపూర్వకప్రయోగముననే ధర్మోత్పత్తి యనుపక్షము) "శాస్త్రపూర్వకే ప్రయోగే అభ్యుదయస్తత్తుల్యం వేదశబ్దేన' అను వార్తికానుసృతమై యుండుటచే నయ్యది వార్తికార మతము మాత్రమే యయియుండుననియు దాని ననుసరించియే మొదటి రెండుపక్షములును నిరాకరింపఁబడి మూఁడవ పక్షము స్థాపింపఁబడి యున్నదనియుఁ దరువాత భాష్యకర్త సిద్ధాంతితమగు తన మతమును నిరూపింపఁదలఁచియే తానీ

పక్షమును మరల స్వీకరించెననియుఁ జెప్పుట కెవ్వరైనను సాహసింపవచ్చును కాని భాష్యకారునికి వార్తికకారుని మత మంగీకరణీయమే కానిచో స్వమతస్థాపన మనునది పరమత నిరాస పూర్వకమే యగుటచే భాష్యకారుఁడు వార్తికకృన్మ తమును ఖండింపవలసినవాఁ డగుచున్నాఁడు ఎట్టి మత స్థాప కుఁడును బరమతమం దేదియో తన కరుచి యుండుటవలననే గదా తదతిరిక్తమగు నొకమతమును దా నాశ్రయింపవల సినవాఁ డగుచున్నాఁడు అట్టి యరుచియేదియు వార్తికకార మతమున భాష్యకర్త సూచింపకుండుటయే యిది భాష్య మతము కాదనుటకుఁ బ్రబల నిదర్శనమైయున్నది ఇదియే గాక "యాజ్ఞే పునః కర్మణి నాపభాష న్తే అను భాష్యమును బురస్కరించుకొని శ్రీ శాస్త్రిగారివాదమే సిద్ధాంతమని యంగీ కరించుచోఁ బూర్వోత్తర భాష్యము లెన్నియో విరోధించు చున్నవి. ఈ భాష్యమునకు మునుముందు వ్యాకరణ ప్రయో జన నిరూపణ సందర్భమున "యస్తు ప్రయుఙ్క్తే కుశలో విశేషే శబ్దాన్ యథావ ద్వ్యవహారకాలే, సోఽన న్తమా ప్నోతి జయం పరత్ర వాగ్యోగవి ద్దుష్యతి చాపశబ్దైః అను కాత్యాయనుని శ్లోకమును బ్రమాణముగాఁ దీసికొని దానిని జాలవఱకు విమర్శించి యపశబ్ద ప్రయోగము దోషదూషిత మనియు సాధుశబ్ద ప్రయోగ మభ్యుదయకారి యనియు సామాన్యాకారముగానే స్థాపించెను పై శ్లోకమున "వ్యవ హారకాలే' అని చెప్పఁబడియుండుటచే నపశబ్ద ప్రయోగము సర్వత్ర దోషదూషితమనుట స్పష్టీకృతము. దీనికి నిదర్శన

ముగా "అజే ర్వ్యఘఞపోః" అను సూత్రమున సూతవై యా కరణ సంవాదమొకటి యుదాహరింపఁబడియున్నది ఈసంవా దమును బట్టి చూచుచోఁ గావ్యములలో నన నేల సామాన్య వ్యవహారములో సయితము నపశబ్ద ప్రయోగము దోషదూ షితమని తోఁపకపోదు ఈ సంవాదమునుబట్టియే పై శ్లోకము లోని "వ్యవహారకాలే" అనుదానికి 'యజ్ఞవ్యవహారకాలే అని సంకోచింపఁజూచుటయు న్యాయదూర మనకతప్పదు కావునఁ బూర్వోత్తర భాష్యములు "యాజ్ఞే కర్మణి పున ర్నాపభాష న్తే" అను భాష్యమునకు విరుద్ధములనుట సత్య దూరముకాదు ఒకవేళ పై భాష్యము సిద్ధాంతిభాష్యమే యని యంగీకరించినను పక్షాంతరోపపాదకమేయగుటచే శ్రీ శాస్త్రిగారి వాదమునకుఁ బ్రబలప్రమాణము కానేరదు "యద్వానః తద్వానః" అని ప్రయోగించుటకు బదులుగా "యర్వాణః తర్వాణః" అని ప్రయోగించుచుండిరిగాన యా కాలములోనివారు వారిని 'యర్వాణు'లనియుఁ, 'దర్వాణు' లనియుఁ బిల్చుచుండిరని పై భాష్యమువలననే విశదపడుచుం డుటచే వ్యవహారములో సయిత మపశబ్దప్రయోగ మప్పుడును నాక్షేపాపాదకముగానే యుండెననుటకు సంశయములేదు ఇట్టి స్థితిలోఁ బై భాష్యము నాధారముగాఁ గొని పాణినీయము వైదికకర్మప్రయోగిభాషామాత్రానుశాసకమే యని నిరూ పించుటయు "అపశబ్దం ప్రయుఞ్జానో రౌరవం నరకం వ్రజే' త్తని విజ్ఞులు వ్రాసినవ్రాఁత లజ్ఞతామూలకములని యుపపా దించుటయు నెంతవఱకుఁ దగియున్నవియో విమర్శించుట కుఁగాఁ బండితలోకముననే వదలివేయుచున్నాను

## మునిత్రయమువారు శాస్త్రిగారి వాద మంగీకరింపరు

శ్రీ శాస్త్రిగారు ప్రామాణికులని యంగీకరించిన ముని త్రయమువారైనను దమవాదమున కేమాత్ర మనుకూలు రుగానున్నారో విమర్శించి చూపెదను

### పాణిని

ఈ శాస్త్రమునకెల్లను మూలపురుషుఁ డగు పాణిని మహర్షి తన శాస్త్రమును సంస్కృత వాఙ్మయమునకెల్ల విపులమగు ననుశాసకముగాఁ దాను రచించుటకుఁ దలపెట్టియుండక శ్రీ శాస్త్రిగారు వ్రాసినట్లు లప్పటికే కొలఁదిగానో యేర్పడియుండిన వైదికకర్మప్రయోగభాషను మాత్రమే యనుశాసింపఁ దలఁచినచో నద్దానికిఁగా నింతటి విపులమగు వ్యాకరణమును రచింపవలసినయవసరము లేదు విస్తృతమగు వేద వాఙ్మయమును సంస్కరించుటకుఁగా నాతఁడట్లు చేసియుండు నని మన మూహింపవచ్చునుగాని యాతఁడు ఛందోమాత్ర విషయకములగు శబ్దముల యనుశాసనవిషయమున "ఛందసి" అని ఛందోగ్రహణమును, భాషామాత్రవిషయకములగు శబ్దముల విషయమున "భాషాయాం" మని భాషాగ్రహణమును జేయుచువచ్చును ఈ ధోరణినిబట్టి పరిశీలించి చూచుచోఁ దక్కుఁగల శబ్దములు పరిశేషన్యాయమున నుభయవిషయకము లనకతప్పదు పాణినీయమున నీ యుభయవిషయకములగు సూత్రములే పెక్కులు గల వనుట కెవ్వరును విప్రతిపన్నులు కా జాలరు అందుచేఁ బాణినిమహర్షి వేదభాషకు మాత్రమే కాక లౌకికభాషకుఁగూడ నీ యనుశాసనమును

రచించి యుండెననుట సిద్ధాంతితము ఇదియేకాక శాస్త్రకర్త యేకొలఁదిగానో యున్న యీ భాషకుఁ దగులక్షణము నేర్ప ఆపఁజాలక యాకృతిగణాదుల నాశ్రయించె ననుటయు నసంగతమే కదా? ఇంతయేల సంస్కృతవాఙ్మయమునెల్లను పాణినీయ మనుశాసింపఁదలఁచె నని సాక్ష్యమిచ్చుటకు "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను నొక్క సూత్రమే చాలియున్నది పై నిదర్శనములనుబట్టి పరీక్షించుచో శ్రీ శాస్త్రిగారి వాదమునకుఁ బాణిని యనుకూలుఁడు గాఁడనుట స్పష్టము

## కాత్యాయనుఁడు

పాణినీయానుశాస్యముగా వీరిచే నంగీకరింపఁబడినశిష్టవ్యవహారభాష యనునది వీరి మతముప్రకారము శిష్టు లగు వారిచేఁ గడుంగడు జాగరూకతతో యజ్ఞాదివైదికకర్మములలో మాత్రమే యుపయోగింపఁబడునది యగుటచే నేవిధమగు వికారమును బొందుటకుఁ గాని వీలు గానిపింపదు అట్టిస్థితిలో దురుక్తసంస్కారకములగు (పాణినిసూత్రము లొకవిధమగు శబ్దములను సిద్ధింపఁ జేయుచుండఁగా మఱియొకవిధమగు శబ్దములను సాధింపఁగల) వార్తికములను గాత్యాయనుఁడు రచించుటయు నసంగత మనకతీరదు ఇదియేకాక సర్వవిధములఁ బాణినిమతమునే యనుసరించి యాకృతిగణాదులను నిర్దేశించి యుండుటచేఁ గాత్యాయనుఁడును వీరి వాదమునకుఁ బ్రతికూలుఁ డనక తప్పదు.

## పతంజలి

ఇఁక మహాభాష్యధోరణినిబట్టి శ్రీ శాస్త్రిగారి వాద మెంతవఱకు సమంజసమో పరికింతము మహాభాష్యకర్త ప్రతి పదోక్త పాఠరూపముగానే శబ్దముల ననుశాసింపవలయునా, లేక యుపాయాంతరముననా యని విచారించు సందర్భమునఁ బ్రతిపదోక్తపాఠము వ్యాకరణరచనకుఁ దగుసాధనము గాదని నిరూపించుటకుఁగాఁ దా నీక్రిందిభాష్యము నుపన్యసించెను

"ఏవం హి శ్రూయతే—బృహస్పతి రింద్రాయ దివ్యం వర్షసహస్రం ప్రతిపదోక్తానాం శబ్దానాం శబ్దపారాయణం ప్రోవాచ నాన్తం జగామ బృహస్పతిశ్చ ప్రవక్తా, ఇన్ద్ర శ్చాధ్యేతా, దివ్యం వర్షసహస్ర మధ్యయనకాలః, న చాన్తం జగామ కింపునరద్యత్వే... . యస్సర్వథా చిరం జీవతి వర్ష శతం జీవతి.. తత్రచాస్యాగమకాలేనైవాయుః కృత్స్నం పర్యుపయుక్తం స్యాత్ .. .. తస్మాదనభ్యుపాయశ్శబ్దానాం ప్రతిపత్తౌ ప్రతిపదపాఠః... . కిఞ్చి త్సామాన్యవిశేషవల్లక్షణం ప్రవర్త్యమ్, యే నాల్పేన యత్నేన మహతోమహత శ్శబ్దౌఘాన్ ప్రతిపద్యేరన్ ఇతి" (చూ మహాభాష్యము పస్పశాహ్నికము.)

పై సందర్భమునుబట్టి చూచుచో బృహస్పతివంటి గురువునొద్ద నింద్రునివంటిమేధావి దివ్యసహస్రవర్షములు పఠించియుఁ దుదముట్టింపఁజాలని ప్రతిపదోక్తపాఠము నెల్లఁ బాణిని సామాన్యవిశేషలక్షణరూపమగు తనశాస్త్రముచే సంగ్రహించినట్లు విశదమగుచున్నది. అపారమగు నంతటిప్రతి పదోక్తపాఠముకూడ వైదిక కర్మోపయోగి భాషామాత్రా

నుశాసకమే యనుట కెవ్వరును సాహసింపరుగదా ? ఇదియే కాక భూలోకమునఁ జేయు యజ్ఞాదికర్మములవలనఁ ' గలుగు సుకృతదుష్కృతఫలములనెల్ల ననుభవించుటకుఁగా నేర్ప ఱపఁబడి ఫలభూమి యని వన్నెకెక్కిన స్వర్గభూమి ఫలభూమియే కాని కర్మభూమికాదని యందఱు నేకగ్రీవముగా నంకరించినదియే అట్టిచో నక్కడ వైదికకర్మోపయోగిభాష యెక్కఁ డున్నదనుటగాని, తదనుశాసకమే ప్రతిపదోక్తపార మనుటగాని గగనకుసుమాయమానమే యగుచున్నది ఇదియే కాక భగవానుఁడగు పతంజలి "సర్వే దేశాన్తరే" యను వార్తికమును వ్యాఖ్యానించుచు "ఉపలబ్ధౌ యత్నః క్రియతామ్ మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః... ...*వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యక మి త్యేతావాన్ శబ్దస్యవిషయః స న్త్యప్రయుక్తా ఇతి వచనం కేవలం సాహసమాత్రమేవ" అని చెప్పియున్నాఁడు అప్రయుక్తములకును మీఁశాస్త్ర మన్వాఖ్యాపక మగుచున్నదని పూర్వపక్షి యాక్షేపింపఁగా నీ భాష్యము నుపన్యసించి పై నుదాహరించిన వాఙ్మయము నంతయు మాశాస్త్ర మనుశాసించి యున్నదనియు, నట్టివాఙ్మయము నెల్లను బరిశీలింపకయే మీఁశాస్త్ర మప్రమాణ మనుట కేవలము సాహసమే యనియు నిరూపించి కావ్యేతిహాసపురాణాది సకల వాఙ్మయమునకును బాణినీయ మనుశాసకమేయనిమహాభాష్యకర్త మనకు విశదపఱచియున్నాఁడు

* ఈభాష్యము లక్ష్యవాఙ్మయప్రదర్శకమని 'పుపురితీ(?)యియిషతి రూపసాధనము - పాణినీయము' అను శీర్షకమున విపరింపఁబడినది. (చూ అనుబంధపరామర్శము )

## సూతవైయాకరణ సంవాదము

మఱియు "అక్షే ర్వ్యృఘఙపోః" అను సూత్రమునఁ బ్రాజితృశబ్దసాధుత్వమును విమర్శించుచు "ఇదమపి సిద్ధంభవతి, ప్రాజితేతి, కించ భో ఇష్యతే ఏతద్రూపమితి బాఢ మిష్యతే—ఏవంహి కశ్చి ద్వైయాకరణ ఆహ, కోఽస్య రథస్య ప్రవేతేతి, సూతఆహ, అహ మాయుష్మన్నస్య రథస్య ప్రాజితేతి వైయాకరణఆహ, అపశబ్దఇతి, సూత ఆహ, ప్రాప్తిజ్ఞో దేవానాంప్రియః న త్విష్టిజ్ఞః, ఇష్యతే ఏతద్రూప మితి, వైయాకరణఆహ, అహో ఖల్వనేన దురుతేన బాధ్యామహే ఇతి సూతఆహ, నఖలు వేఞస్సూతః, సువతేరేవ సూతః, యది సువతేః కుత్సా ప్రయోక్తవ్యాదుస్సూతేనేతి వక్తవ్యమ్" అనిసూతవైయాకరణసంవాదము నొకదానిని దృష్టాంతీకరించియున్నాఁడు. పై సంవాదము కావ్యభాషకే కాక యానాఁటివ్యావహారికభాషకు నయితము పాణినీయ మనుశాసకమై ప్రమాణీకరింపఁబడియున్నదని నొక్కి వక్కాణించుచున్నది. ఇట్టిభాష్యము లెన్నెన్నియో శ్రీ శాస్త్రిగారివాదము నకుఁ బ్రతికూలములుగాఁ గానిపించుచున్నవి. కావునఁ బతంజలిభగవానుఁడను శాస్త్రిగారివాదము నంగీకరింపఁడనుట విస్పష్టము. ఇవియే గాక పై సంవాదమున వైయాకరణుఁ డపశబ్దప్రయోగము చేసితివని సూతునాక్షేపించుటయు, నాతఁడు తాను బ్రయోగించిన ప్రాజితృ శబ్దము సాధుశబ్దమే యనిసమర్థించికొని "దుస్సూతే నేతి వక్తవ్యమ్" అని వైయాకరణుని బరిహసించుటయుఁ జూడఁ గావ్యభాషలో వలనేల,

నాఁటి వ్యావహారికభాషలో నియితము నపశబ్దప్రయోగము దుష్టమైయుండెననుట సర్వజనసమ్మత మనఁకతీరదు

## సంస్కృతము సర్వజనవ్యవహారోపయోగిభాష

ఇది యంతయు నిట్లుండ నేకాలమునను సంస్కృతభాష సర్వజనోపయోగిదేశభాషగా నుండ లేదను శ్రీ శాస్త్రిగారి మతియొక సిద్ధాంతముకూడ నెంతవఱ కాదరణీయమో పరిశోధింతము పై నుదాహరించిన సూతసంవాదమే యాకాలములోని సర్వజనులును సంస్కృతభాషనే దేశభాషగా నేర్పఱచికొని వ్యవహరించుచుండెడివా రనుటకుఁ బ్రబలనిదర్శనమై యున్నది "తస్మిం శ్చాతిమహతి శబ్దస్య ప్రయోగవిషయే తే తేశబ్దా స్తత్రతత్ర నియతవిషయా దృశ్యన్తే తద్యథా-శవతి ర్గతికర్మా కమ్బోజేష్వేవ భాషితో భవతి, వికారఏనమార్యా భాష న్తే శవఇతి హమ్మతి స్సురాష్ట్రేషు, రంహతిః ప్రాచ్యమధ్యేషు, గమిమేవ త్వార్యాః ప్రయుజ్జతే దాతి ర్లవనార్థే ప్రాచ్యేషు దాత్ర ముదీచ్యేషు" అను పస్పశాహ్నికభాష్యమును దత్తద్దేశములలో ననేకవిధములగు వికారములతో నీభాష వెలయుచున్నదని సుస్పష్టముగా నుద్ఘోషించుచున్నది ఈ గీర్వాణభాష యేకాలములోనో దేశదేశములను సర్వజనవ్యవహారోపయోగిదేశభాషగా నుండనిచోఁ దా నిట్టివికారములకు లక్ష్యభూతమై యుండదని నిస్సంశయముగా మన మంగీకరింపవచ్చును ఇంతయేల సంస్కృతమున కపభ్రంశరూపమే ప్రాకృతమని మీ రంగీకరించినదే కదా? అట్టిచో మహారాష్ట్రాది దేశములలో నెంతకాలమునుండియో దేశభాషగా నుండి

యవాంతరభాషల నెన్నిటినో సృజించి శాఖోపశాఖలతో నల రారుచున్న యీప్రాకృతభాష వీరిమతముప్రకారము శిష్ట వైయాకరణమాత్ర వ్యవహృత మగు సంస్కృతమునుండియే కలిగియున్నదనుట న్యాయదూరమనకతప్పదు వాల్మీకిమహర్షి తా నీప్రాకృతసంస్కారమున కెల్లను మూలపురుషుఁడై వ్యాకరణమును రచించియుండుటచే రామాయణ కాలము నాఁటికే సంస్కృతమునకంటె విలక్షణముగా నీభాష దృఢపడి యున్నదని మన మూహింపవచ్చును ఇట్టి నిదర్శనముల ననుస రించి రామాయణకాలమునకంటెఁ బూర్వమునుండియే చిరం తనముగా సంస్కృతభాష సర్వజనసాధారణముగా నన్నిదేశ ములయందును వ్యవహరింపఁబడియున్నదనియుఁ దరువాత నయ్యది క్రమక్రమముగా వికారమును బొందుచు మిశ్ర ముగా (సాధ్వపభ్రంశాత్మకమై) వ్యవహారములోఁ గొంత కాలముండి మఱికొన్నినాళ్లకు పాళి, హింది, బెంగాళి మొద లుగాఁగల శాఖోపశాఖలతో నేర్పడియున్న ప్రాకృతభాషా మహావృక్షము నొకదానిని గల్పించియుండును. ఈ సంస్కృత భాషయే వైపద్ధతి ననుసరించి తత్తత్కాలములలో సర్వజన వ్యవహారోపయోగిగా నుండి యీ ప్రపంచమునందలి భాషా కుటుంబమున కెల్లను మూలభూతమై సకలభాషాప్రపంచ సృష్టికర్త్రి యనుబిరుదము నుపార్జించి మాతృభాష యని జగజ్జేగీయమానముగా శ్లాఘింపఁబడుచున్నదని మనము సిద్ధాంత మొనరింప వచ్చును. ప్రాచీనవాఙ్మయ మెల్ల నిట్టి సిద్ధాంతమునే స్థిరీకరింపఁ గలిగియున్నది. భోజచరిత్రాదిప్రబం

థము లన్నియు నీ విషయమునఁ బ్రత్యక్షసాక్ష్యము నిచ్చు చున్నవి ఈ విషయము అనుబంధపరామర్శమున నింకను వివరింపఁబడినది

ఇది యంతయు ని ట్లుండఁగా మహాభాష్యధోరణిని బట్టి వైదికకర్మోపయోగిశిష్టవ్యవహారభాష యనునది యొకటి కల దనియుఁ, బాణినీయ మంతయుఁ దన్మాత్రానుశాసకమే యయియున్న దనియు నందుచేఁ గావ్యభాషానుశాసకముగా మఱియొక వ్యాకరణమును గల్పింపవలసియున్న దనియు శ్రౌత స్మార్తాది పుణ్యకర్మములలోఁ దక్కఁ దక్కుస్థలములలో నప శబ్ద ప్రయోగ మాత్రే పాపాదకమే కాదనియు.సంస్కృతభాష సర్వజనోపయోగి దేశభాషగా నేకాలములోను నుండ లేదనియు శ్రీ శాస్త్రిగారు వ్రాసినసిద్ధాంతములు పై విమర్శనమునఁ జర్చించినరీతిని బ్రమాణములు గా వని లోకమున కెఱుక పఱచుకొనుచున్నాను

---

# పాణినీయము - కావ్యవాఙ్మయము

## మహాకవిప్రయోగసాధనము



"అపాణినీయ ప్రయోగములు పరశ్శతములు కావ్యములలోఁ గలవు అందుఁ బ్రధానతమము లివి" అని శాస్త్రి గారు మొత్తము పదునొకండు ప్రయోగములు 'చింతామణి విషయపరిశోధనము' నఁ బ్రదర్శించిరి (పుటలు ౧౧౧-౧౧౫). అవి యన్నియుఁ బాణినీయములని నిరూపించుటయే యీ శీర్షకములోని ప్రధానవిషయము

### ౧ లుఙ్‌లఙ్ఙాదిప్రయోగములు-పాణినీయము

"అద్యతనభూతము, అనద్యతనభూతము అనద్యతన పరోక్షభూతము మున్నగు నియమములు వీడిన ప్రయోగము లెల్లఁ బాణినీయసమ్మతములు కావుగదా" అని శ్రీశాస్త్రిగారనుచున్నారు ఈ ప్రయోగములు పాణినీయ సమ్మతములో, కావో చర్చింతును

ఒక వస్తువున సామాన్యవిశేషధర్మములు రెండును నున్నప్పుడావస్తువునందలి విశేషధర్మమును వివక్షించి విశేషధర్మబోధకముగ నొకప్పుడును, సామాన్యధర్మము వివక్షించి సామాన్యధర్మబోధకముగ మఱియొకప్పుడును శబ్దప్రయోగ మొనర్చుట లోకసహజము ఉదా: చూతవృక్షము - ఇందు వృక్షత్వ మను సామాన్యధర్మమును, చూతత్వ మను విశేష

ధర్మమునుగూడఁ గలవు ఒకతఱి విశేషధర్మ మగు చూతత్వ
మును వివక్షించి చూతవృక్షమునే చూత మందుము మఱి
యొకపరి సామాన్యధర్మ మగు వృక్షత్వమును వివక్షించి
చూతమునే వృక్ష మనియు నందుము ఇం దేదియును దప్పు
కాదు ఇట్లే భూతకాలమందు భూతత్వ మను సామాన్యధర్మ
మును, 'అనద్యతనభూతత్వ' మను విశేషధర్మమును గలవు.
ఇందు 'అనద్యతనభూతత్వ' మను విశేషధర్మమును వివక్షించిన
'అనద్యతనభూతే లఙ్' అను సూత్రమున లఙ్ ప్రత్యయము
వచ్చును ఇఁక నీ 'అనద్యతనభూత'మును 'అనద్యతనభూతము'
గా అనఁగా విశేషధర్మరూపముగా వివక్షింపక భూతసామా
న్యముగా వివక్షించునప్పుడు చూతమందు వృక్షశబ్ద ప్రయో
గమువలెనే 'అనద్యతనభూత' మందు నయితము లుఙ్ ప్రయో
గము విరుద్ధము కాదు ఇట్లే లుడర్థమున లుట్, లృట్ ప్రత్య
యములును లృడర్థమున లృట్ లుట్ ప్రత్యయములును,
లిడర్థమున లుఙ్,లఙ్ ప్రత్యయములును లుఙర్థమున లిట్ లఙ్
ప్రత్యయములును లఙర్థమున లిట్, లుఙ్ ప్రత్యయములును
బరస్పరబాధకములు కాక వక్తృవివక్షాధీనములు గాఁ బాణి
నీయమునుబట్టియే సాధువు లగుచున్నవి ఒకవస్తువునం దున్న
ధర్మము ప్రయోక్త వివక్షింపకపోవుటయు, లేని ధర్మమును
వివక్షించుటయు లోకసిద్ధము లని అనుదరా కన్యా
సముద్రః కుండికా అను దృష్టాంతములఁ బ్రదర్శించి 'అద్య
తనా' దులయం దనద్యతనాదుల వివక్షించి లఙాది ప్రయోగ
ములును భూతసామాన్యమును వివక్షించి లుఙాదిప్రయోగ
ములును 'అనద్యత' నాదులయందు భూతసామాన్యాదుల

వివక్షించి లుఙ్జాదిప్రయోగములును పాణినీయానుశిష్టము లని మహాభాష్యకర్తయే వివరించినాఁడు (చూ. మహాభాష్యము, 3-౨-౧౧౦) ఈ మహాభాష్య వచనములు 'అద్యతనభూతము', 'అనద్యతనభూతము' మున్నగునియమములు వీడిన వని శ్రీశాస్త్రిగా రనిన మహాకవిప్రయోగము లన్నియును పాణినీయమునుబట్టియే సాధువు లని నొక్కి వక్కాణించుచున్నవి మహాభాష్యకలశాంబుధి నాలోడించి దాన నేర్పడిన సుశబ్దప్రయోగామృత మాస్వాదించి జీర్ణింపఁజేసికొనిన మహాకవు లిట్టివి యేల ప్రయోగింపరు? ఈప్రయోగములు పాణినీయమర్మజ్ఞులు కవులని చాటునవియో, కాదని యుద్ఘాటించునవియో నిరూపించుటకుఁ బాఠకలోకమే ప్రమాణము అపరిశోధనమూలకముగ నపాణినీయము లనఁబడు నిట్టివియా కావ్యభాషకు వేఱువ్యాకరణము కావలయు ననుటకు శ్రీ శాస్త్రిగారి కాధారములు?

## ౨ 'అక్షౌహిణ్యా ముపసంఖ్యానమ్— అక్షోహిణీ, అక్షౌహిణీ

ఇట 'అక్షోహిణీ' 'అక్షౌహిణి' అను రెండు రూపములు వార్తికకారసమ్మతము లనిన తత్త్వబోధినీగ్రంథమును వివరించి యా వ్యాఖ్యానము తప్పనుచు శ్రీ శాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు "వార్తికకారునకు 'అక్షోహిణీ 'అక్షౌహిణీ' అను రూపద్వయమునకును సాధుత్వ ముపదేశించు తలంపే యున్న యెడల నాతఁడా వార్తికమును వైకల్పికముగ నుపదేశించియుండఁడా?' (పుట ౧౧౩) ఇఁక యథార్థమెట్టిదియో

పరిశోధింతము. ఇట వ్యాఖ్యాతలు పొరపడినారని శ్రీ శాస్త్రి గారి యాశయము. ఈవార్తికము 'అక్షౌహిణీ' శబ్దసాధనమున కేర్పడినది గాని 'అక్షోహిణీ శబ్దనిషేధమున కేర్పడినదికాదు. ఊహినీశబ్దముతో 'అక్ష' శబ్దమునకు సంబంధ మేర్పడినపుడు వృద్ధియగు ననునదియే దీని యర్థము 'అర్థవద్గ్రహణే నానర్థకస్య గ్రహణమ్' అను పరిభాష పాణినీయశాస్త్రసిద్ధ మయి జాగరూకత వహించియుండుటచే ఊహినీ' శబ్దమునకు విధింపఁబడిన వృద్ధి 'ఊహ శబ్దమునకు రాదు. 'ఊహ శబ్దమునకు 'అక్ష' శబ్దముతో సమాన మేర్పడిన అక్షోహ' శబ్దము నిష్పన్నమగును. తరువాత 'అక్షోహాః అస్యా అస్తి' అను నర్థమున 'అక్షోహ' శబ్దమునకు వచ్చిన 'ఇని' ప్రత్యయము 'అక్షోహ' అను సముదాయమునకు సంబంధించినదిగాని తదేకదేశ మగు 'ఊహ' శబ్దమునకు సంబంధించినది కాదు. ఇట్లు వృద్ధినిమిత్తక మగు 'ఊహినీ' శబ్దమే కానరాని యీ లక్ష్యమున వార్తికము ప్రవర్తింపదు గదా ఇట్టిచో 'అక్షోహిణీ' శబ్దసాధనమున వ్యాఖ్యాత లొనర్చిన యపరాధ మేమి? స్వనిమిత్తములు లేక సూత్రవార్తికములు ప్రవర్తించుటయెట్లు? వార్తికకారునకు అక్షోహిణీ, అక్షౌహిణీ' శబ్దములు రెండును సాధువులుగా సమ్మతములే. ఐన 'వా'గ్రహణమేల చేయలేదని శ్రీ శాస్త్రిగా రడిగిరి 'వా' గ్రహణము లేకయే యీ రెండు రూపములును స్వరసముగాఁ బాణినీయ సాధితము లగుచుండ వ్యర్థముగా నతఁ డేల 'వా' గ్రహణము చేయవలయును? ఇంత యేల? మహాభాష్యకర్తయే ఆత్మన్ శబ్దములోని తృతీయావిభక్తికి లోపము రాదని సమాసము

నందు 'ఆత్మనాచతుర్థః' వంటి ప్రయోగముల సాధించుచున్న 'ఆత్మనశ్చ' అను సూత్రవ్యాఖ్యానావసరమున 'జనార్దన స్త్వాత్మచతుర్థ ఏవ' అను మహాకవి ప్రయోగమును బ్రదర్శించి 'ఆత్మా చతుర్థః అస్య' అను విగ్రహమును జూపి బహువ్రీహిసమాసాశ్రయణముచేఁ బై సూత్రము ప్రవర్తింపక విభక్తిలోపము వచ్చి 'ఆత్మచతుర్థః' అను ప్రయోగము సాధువగుచున్న దని స్పష్టముగా నిరూపించెను దీనినిబట్టి 'ఆత్మనా చతుర్థః' ఆత్మచతుర్థః' అను రెండు రూపములును సమాసభేదముచే సూత్రకారసమ్మతము లనియేకదా మహాభాష్యకర్త నిర్వచించెను? అట్లైన సూత్రకారుఁ డేల 'వా' గ్రహణము చేయలే దని పతంజలిని మన మడుగుట యెంతవఱకు సమంజసమో విజ్ఞు లూహింపుఁడు. ఇట్టి వనేకములు మహాభాష్యమునఁ బ్రదర్శింపఁబడినవి ఇట వ్యాఖ్యాత లొనర్చిన వింత వ్యాఖ్యానము లేవియు లేవు పాణినీయశాస్త్ర సంప్రదాయజ్ఞుల కిది యొక క్రొత్తవిషయముగాఁ జేసి యింతగా బోధింప నక్కఱలేదు

3 'ఆజో యమహనః'

'ఆజఘ్నే విషమవిలోచనస్య వక్షః', 'ఆహధ్వం మారమూర్తమమ్' - 'స్వాంగకర్మకా చ్చేతి వక్తవ్యమ్' అను వార్తికమునుబట్టి పై సూత్రము స్వాంగకర్మకముగాని, అకర్మకముగాని యగునప్పుడే 'ఆఙ్' పూర్వకము లగు 'యమ, హన' ధాతువులకు ఆత్మనేపదమును విధించుచున్నది. పై ప్రయోగము లట్టివి కావుగాన 'అపాణినీయము' అని శ్రీ శాస్త్రి

గారు వ్రాసిరి ఇక్కడఁ బాణినీయమునుబట్టి యీ ప్రయోగ ములు సాధించుటకు వ్యాఖ్యాతలు త్రొక్కిన భిన్నభిన్న మార్గములు గూడఁ బ్రదర్శించిరి భాగవృత్తికారాదులు 'ప్రాప్య' అనుదాని నధ్యాహరించి 'రఘూత్తమం ప్రాప్య మా ఆహ్వథ్వమ్' అనురీతిని సమన్వయించి పాణినీయమునుబట్టియే ఆత్మనేపదమును సాధించిరి ఇట్లే 'విమమవిలోచనస్య వక్షః ఉపసృత్య గాండీవీ భుజాభ్యా మాజఘ్నే' అని యన్వయించు కొనిన భారవిప్రయోగమున నైనను ఆత్మనేపద మసాధువు కాదు కావ్యములలోని శ్లోకముల సమన్వయించుట కధ్యా హారము లక్కడక్కడ నవసర మగుటయు వానిని మనము పూరించుకొనుటయుఁ గావ్యపాఠకు లెల్లరకు విశదమే అట్టివి దుష్టములుగాని, యస్వరసములుగాని కావ్యసంప్రదాయమును బట్టి కాఁజాలవు. హేమచంద్రాదు లిట్టివి కవిప్రమాదము లే యని పదదోషములలో నొకటి యగు చ్యుతసంస్కారమున కుదాహరణముగా నొసఁగిరి - కవులకుఁ బ్రమాదములు తప్పని వని తరువాత నిరూపించెదను ఏమైన నిట్టివి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనునవి కావు

## ౮ 'సుభ్రు' శబ్దము - తత్సాధనము

"విమాననా సుభ్రు కుతః పితు ర్గృహే—అను కాళి దాస ప్రయోగమునందలి సంబోధనహ్రస్వము అపాణినీయము కా గా 'సుభ్రూదీర్ఘ్యజమ్బాఖ్యానాం హ్రస్వః' అని ఇట్లు (ముగ్ధ ౧౫౩) వొపదేవుఁడు సాధించియున్నాఁడు అని శాస్త్రిగారు వ్రాసినారు (పుట ౧౧౪) సుభ్రూశబ్దమున కేర్ప

డిన యీ ప్రాస్వ మపాణినీయ మని శాస్త్రిగారు వ్రాసిరి. కాని యిది యట్టిది కాదు ఈ శబ్దసాధనమునకు ముందు కవు లెందఱీ శబ్దము నిట్లు ప్రయోగించిరో యవలోకింతము

'హా పితః క్వాఽసి హే సుభ్రు (భట్టి) 'ప్రథమమగురుషట్కం సుభ్రు తాం సంగిరంతే (శ్రుతబోధము-కాళిదాసుఁడు) 'ముకుళయతి చ నేత్రే సర్వదా సుభ్రు ఖేదః' (మాలతీమాధవము-భవభూతి) 'యాని వై శ్రవణే సుభ్రు '(సుందరకాండము-వాల్మీకి) సుభ్రు త్వం కుపితేత్యపాస్తమశనం త్యక్త్వా కథా యోషితామ్' (మఱియొక మహాకవి)

ఇక నేతత్సాధనప్రకార మెట్టిదియో యరయుదము సంస్కృతమహాకవు లందఱును మహాభాష్యమును సమగ్రముగా నధ్యయనించి తెదవలోడన మొనర్చి తన్మర్మముల నెఱిఁగినవారు కావ్యసృష్టియే పరమావధిగాఁ గల వీరు యథార్థము నిరూపింపఁ జాలక వాదప్రతివాదముల కాకరమగు వ్యాఖ్యాతల కేవల శాస్త్రసమన్వయదృష్టితోడనే ప్రధానముగాఁ బాణినీయము నవలోకింపక ప్రామాణికశిరోమణి యగు మహాభాష్యకర్త ప్రదర్శించిన యుదాహరణములఁ బట్టియు, స్వయముగా నాయాసందర్భములలో నతఁ డొనర్చిన ప్రయోగములఁబట్టియు శాస్త్రకర్తల యాశయ 'మిదమిత్థ' మ్మని నిర్ణయించి దాన నేర్పడిన సాధుప్రయోగరత్నముల తోడనే స్వకావ్యభూషల నలంకరించిరి కవిప్రయోగముల కును మహాభాష్యమునకును గల పరస్పర సంబంధమును విశదీకరించి యీ యాశయ మిట్టి దని స్థాపింపఁగల నిదర్శనము లనేకములు గలవు స్థాలీపులాకన్యాయముగా నొకటి మాత్ర

మిట నుదాహరించెదను మహాభాష్యకర్త యొక్క సందర్భమున విశేష్యనిఘ్నము—విశేష్యమును బట్టి లింగవ్యవస్థ గలది— అగు శక్యశబ్దమును నపుంసకముగా 'శునా శక్యం ప్రతిహంతుం శక్యా' అనుటకు మాఱు 'శక్యం చానేన శ్వమాంసాదిభిరపి క్షుత్ ప్రతిహంతుమ్' (౧-౧-౧) అని ప్రయోగించెను. ఈ మహాభాష్య ప్రయోగమును గాంచి మహాకవులు తమ కావ్యములలో విశేష్యాశ్రయ మగు లింగవ్యవస్థను ద్రోసి పుచ్చి శక్యశబ్దమెట్లు ప్రయోగించియున్నారో పరికింపుఁడు:

'శక్యమరవిందసురభిః కణవాహీ మాలినీతరంగాణామ్
అంగైరనంగతప్తై రవిరళ మాలింగితుం పవనః'
(శాకుంతలము, ౩-౪)

'శక్య మోషధిపతే ర్నవోదయాః
కర్ణపూరరచనాకృతే తవ' (కుమా ౮-౬౨)
''శక్యమంజలిభిః పాతుం వాతాః కేసరగంధినః'
(రామా'

పై ప్రయోగములనుబట్టి పాణినీయమునకు రామాయణమునకును పాణినీయమునకుఁ గాళిదాసాది మహాకవుల కావ్యములకును గల పరస్పరసంబంధ మెట్టిదియో మన మూహింపవచ్చును మొట్టమొదట నాదికవి యగు వాల్మీకి తన కావ్యమున 'శక్యా అంజలిభిః పాతుం వాతాః కేసరగంధినః' అనుటకు మాఱు 'శక్యమంజలిభిః పాతుం వాతాః కేసరగంధినః' అని స్వోపజ్ఞముగా నీప్రయోగ మొనర్చెను. అటుతరువాతఁ బాణినీయ ప్రాసాదమునకు మూలస్తంభమై, మునిత్రయమువారిలో నొకఁడగు మహాభాష్యకర్త యేతత్ప్ర

యోగాన్వేషణమున జాగరూకు డై రామాయణాది మహాకావ్యములలోని సాధుప్రయోగముల నశేషముగా సాధించుటయే మహా పరమాదర్శ మని చాటుచు 'శక్యం చానేన శ్వమాంసాదిభిరపి క్షుత్ ప్రతిహంతుమ్' అని పై రామాయణ ప్రయోగముతోఁ దుల్యకక్షముగాఁ దానును బ్రయోగించి యేతదనుగుణముగాఁ బ్రక్రియ నేర్పఱచి దీని సాధింపుఁ డని పాణినీయుల కాజ్ఞాపించినాఁడు వ్యాఖ్యాత లీక్రిందిరీతిని సాధింపఁ గడఁగినారు.

I "శక్తేః కర్మసామాన్యే లింగసర్వనామ నపుంసక యుక్తే కృత్యప్రత్యయః తతః పదాంతరసంబంధాదుపజాయమానమపి స్త్రీత్వం బహిరంగత్వా దంతరంగ సంస్కారం న బాధతే ఇతి శక్యం క్షు' దిత్యుక్తమ్ యదా తు పూర్వమేవ విశేషవివక్షా తదా 'శక్యా క్షు' దితి భవత్యేవ.. ' (కైయటము, ౧-౧-౧)

II "శక్తేః 'శకిసహోశ్చ' ఇతి కర్మణి యతి సతి శక్యమితి రూపంభవతి. కర్మాభిధాయాం కర్మవచనే లింగవచనస్యాపి సామాన్యోపక్రమాత్ విశేషానపేక్షాయా మితి. యథా—'శక్యమోషధిపతే ర్నవోదయాః కర్ణపూరరచనాకృతే తవ, అప్రగల్భయవసూచికోమలా శ్ఛేత్తు మగ్రనఖసంపుటైః కరాః' నచైకాంతిక స్సామాన్యోపక్రమః తేన 'శక్యా భంక్తుం ఝటితి బిసినీకందవచ్చంద్రపాదా' ఇత్యపి భవతి" (కావ్యాలంకార సూత్రవృత్తి ౫-౨-౨౩)

III "శక్యమి త్యవ్యయమ్ నచే చ్ఛక్య ఇతి ప్రయోగస్స్యాత్. తథా—రామాయణేఽపి 'శక్య మంజలిభిః పాతుం

వాతాః కేసరగంధినః (శాకుంతలము - శ్రీనివాసవ్యాఖ్య)

ప్రతిపదోక్తము లగు స్వసూత్రవార్తికాదులే కాక స్వప్రయోగాదులచేఁ దాము సూచించిన యర్థము సయితము పాణినీయమునకు మూలాధారమని 'నమునే' సూత్రభాష్య మున మహాభాష్యకర్త స్పష్టీకరించినాఁడు

ఇఁకఁ బ్రకృత మనుసరింతము 'సుభ్రు' అనురూప సాధనమునకు మహాభాష్యకర్తయే పాణినీయమున మార్గ మేర్పఱచెను 'అప్రాణిజాతేశ్చారజ్జ్వాదీనామ్' అను వార్తి కమునకు సహజదీర్ఘోకారాంతము లగు 'అలాబూః, కర్కంధూః' అనునవి మహాభాష్యమున నుదాహరింపఁబడినవి. "ఊఙ్ ప్రకరణేఽప్రాణిజాతేశ్చారజ్జ్వాదీనా మితి వక్తవ్యమ్ అలాబూః కర్కంధూః అప్రాణిజాతే రితి కిమర్థమ్? కృక వాకుః అరజ్జ్వాదీనామితి కిమర్థమ్? రజ్జుః హనుః' (మహా భాష్యము ౪-౧-౬-౬౬) అత్ర ఉద్ద్యోతకారః - "ఊఙి సతీతి—అత్రవార్తికే ఉత ఇత్యస్యాసంబంధ ఇతిభావః

'భ్రూ'శబ్దమునకు 'సు' శబ్దముతో సమాస మేర్ప డఁగా సుభ్రూశబ్దము నిష్పన్న మగును ఈ సుభ్రూశబ్దము సహజదీర్ఘోకారాంతమే యైనను మహాభాష్యకర్త యొసఁగిన వార్తికోదాహరణములఁబట్టి 'అలాబూః కర్కంధూః' అను వానికివలెనే యీ వార్తికముచే 'ఊఙ్' ప్రత్యయమువచ్చుట మహాభాష్యాభిప్రేతమనకతప్పదు ఇట్లు ఊఙంత మైన సుభ్రూ శబ్దమున భ్రూశబ్దావయవ మగు నూకారమే కానరా దని 'అచిశ్నుధాతుభ్రువాం య్వో రియఙువఙౌ' అను సూత్ర మీ లక్ష్యమును ద్రోసిరా జనఁగా 'నేయఙువఙ్స్థానావస్త్రీ' అను

నదీసంజ్ఞానిషేధ మిటం బ్రవర్తింపలేదు. 'అంబార్థనద్యోర్హ్ర స్వః' అను హ్రస్వ మిందుకు బాధకములేదుగదా యని సుభ్రూ శబ్దమునకు హ్రస్వ మనుగ్రహించినది ఊఙ్గంతమగు సుభ్రూ శబ్దమునకు సంబోధనమున 'హేసుభ్రు' అను రూపము పాణి నీయమునుబట్టియే యిట్లేర్పడినది మల్లినాథాదులు సయితమీశబ్ద మిట్లు పాణినీయసాధిత మగుచున్న దని వ్యాఖ్యానించిరి

'సుభ్రు ఇత్యత్ర భ్రూశబ్ద స్యోవఙ్స్థానీయత్వాత్ నేయఙువఙ్స్థానా వస్త్రీ' ఇతి నదీసంజ్ఞాప్రతిషేధాత్ 'అంబార్థనద్యోర్హ్రస్వః' ఇతి హ్రస్వత్వంనాస్తి తేన హ్రస్వః ప్రామాదిక ఇతి కేచిత్. అన్యేతు 'అప్రాణిజాతేశ్చారజ్ఞ్వాదీనా' మిత్యత్ర 'అలాబూః కర్కంధూః' రిత్యుకారాంతా ద ప్యూఙ్ప్రత్యయ ముదాజహార భాష్యకారః-ఏతస్మా దేవ నియమజ్ఞాపకాత్ క్వచి దూకారాంతస్యాప్యూఙ్ఙంతత్వా న్నదీత్వే హ్రస్వత్వ మి త్యాహుః అత ఏ వాహ వామనః 'ఊకారాంతాద ప్యూఙ్ ప్రకృతే' రితి 'సుభ్రుః కుతస్త్వాతగృహేఽవమానన' మితి పారాంతరకరణం తు సాధ్వస మేవ ఉక్తోప పత్తిసంభావనాత్, అన్యత్రాపి 'సుభ్రు త్వం కుపితే త్యపాస్త మశనం త్యక్త్వా కథాయోషితామ్' ఇత్యాది ప్రయోగదర్శనాత్ ' (కుమా ౫-౮౩ మల్లినాథవ్యాఖ్య)

"భ్రూశబ్దాత్ 'అప్రాణిజాతేః' ఇత్యాది నోఙ్, ఉవఙ్ఙాంతమాత్రస్య విధానా ద్బహువ్రీహిః ఉపసర్జనత్వం చ, పునః స్త్రియా మూఙ్ 'అంతాదివచ్చ' ఇతి పూర్వం ప్రత్యం

తవత్త్వా త్ప్రాతిపదికత్వమ్. అతః సంబుద్ధౌ హ్రస్వత్వమ్" (భట్టి ౬-౩౦౨ జయమంగలవ్యాఖ్య).

"కథమ్ 'హా పితః క్వాఽసి హేసుభ్రు' ఇతి భట్టిః' 'విధానానా సుభ్రు కుతః పితు ర్గృహే' ఇతి కుమారః? అనేన నదీత్వప్రతిషేధా ద్ధ్రస్వాభావాత్ ఉచ్యతే—'అప్రాణిజాతే శ్చారజ్జ్వాదీనామ్' ఇత్యూఙి సమాసే ఉపసర్జనహ్రస్వత్వే కృతే ఊఙుతః' ఇ త్యూఙి తస్య సముదాయభ క్తత్వా దత్ర నోవఙ్ స్థానత్వ మితి సంబుద్ధిహ్రస్వ ఇతి భట్టి టీకా 'వామి' ఇత్యతో వాగ్రహణ మపకృష్య వ్యవస్థితవిభాషాత్వాదితి శ్రీ కంఠః" (దుర్ఘటవృత్తి)

మహాభాష్యమరస్జ్ఞ లగు కవు లిట్టివి ప్రయోగింపక మానరుగదా మహాభాష్యమునుబట్టి పాణినీయసూత్రములకుఁ గవు లానాఁ డొనర్చిన వ్యాఖ్యానము లెట్టివియో సరిగాఁ బరి శోధించుకొనక వారి ప్రయోగము లన్నియు నపాణినీయము లనిన నది మన దోషముగాని కవుల దోషము కాదుగదా పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనుట కిఁక నివి సాధకములా, బాధకములా ?

## ౫. ఛాందసప్రయోగములు-తత్సాధనము

"త్రియంబకం సంయమినం దదర్శ" అనుచోట 'త్రియంబక' శబ్ద మపశబ్దముగనే పరిగణింపఁబడుచున్నది ఆ శ్లోకమునకు వ్యాఖ్యానము చేయుసందర్భమున 'మహాకవి ప్రయోగత్వా త్సోఢవ్యః' అని మల్లినాథుఁడు వ్రాసియు

న్నాఁడు" అని శ్రీశాస్త్రిగారు వ్రాసియున్నారు (పుటగ౧౮). వేదమున 'త్రియంబకమ్', 'త్ర్యంబకమ్' అను రెండు రూపములును గలవు లోకమున 'త్ర్యంబకమ్' అనునదియే ప్రయోగార్హము అట్టిచో ఛాందస మగు 'త్రియంబకమ్' అనునది లోకమున నెట్లు సాధువగు ననువిషయమే యిప్పుడు చర్చింప వలసినది ఛాందసప్రయోగముల మఱికొన్నిటిఁ గూడఁ గవులు కావ్యములలోఁ బ్రయోగించిరి 'నామరూపంకుహో*త్పన్నమ్','విజ్ఞానం చ కుహోత్పన్నమ్' 'సంస్కారాశ్చ కుహోత్పన్నాః' (అశ్వఘోషుఁడు) 'భక్తస్య తత్ర సమరన్త†మమాఽపి వాచః' (భవభూతి) 'మహిమ్నః పంథానం మదన పరిపంథిప్రణయిని' (మూకకవి) మొ

మహాకావ్యములలోని యీ ఛాందసప్రయోగములు పాణినీయమునుబట్టి యెట్లు సాధువులు కాఁగలవో మన మిఁకఁ జర్చింతము 'పద్దన్నో మాస్ హృన్నిశసన్యూషన్దోషన్యకఞ్ ఛకన్నుదన్నాసఞ్ఛస్ప్రభృతిషు' అను సూత్రములోనికి 'శీర్షంశ్ఛందసి' అను సూత్రమునుండి 'ఛందసి' అను దానిననువర్తించి పదాద్యాదేశములు ఛాందసము లనియే కైయటాదులు వ్యాఖ్యానించిరి 'మాసశ్ఛందసి' అను వార్తికమున

---

* కింశబ్దమునకు 'వా హ చ చ్ఛందసి' అను సూత్రముచే ఛాందస మగు 'కుహ' అను రూప మేర్పడినది.

† 'సమరంసత మేఽపి' అనునది ముద్రితపాఠమైనను, ప్రాచీన పాఠము 'సమరన్త' అనునదియే. 'బహుళం ఛంద స్యమాఙ్యోగేఽపి' అను సూత్రమున నేర్పడిన 'సమరన్త' అనునది ఛాందసరూపము (చూ. ప్రౌఢ ప్రయోగసంగ్రహము)

వార్తికకారుఁ డొనర్చిన ఛందోగ్రహణమునుబట్టి లోకమునఁ గూడఁ గ్వాచిత్కముగా నీప్రయోగములు సాధువు లనిరి. (చూ కైయటము, ౭-౪-౪౮)

సిద్ధాంతకౌముదీకర్తయగు దీక్షితుఁడు కూడ నిట్లు వ్రాసియున్నాఁడు "పద్దన్న ఇత్యత్ర హి చ్ఛంద సీత్యను వర్తితం వృత్తౌ. తథాఽప్యహోభీత్యత్ర మాసశ్ఛందసీతివార్తికే ఛందోగ్రహణసామర్థ్యాల్లోకేఽపి క్వచి దితి కైయటోక్త రీత్యా ప్రయోగ మనుసృత్య పదాదయః ప్రయోక్తవ్యా ఇతి బోధ్యమ్' (అజంతనపుంసకలింగప్రకరణము). మఱియును 'క్యాచ్ఛందసి' అను సూత్రముచే నిష్పన్నమై వైదికమగు 'అధ్వర్యు' శబ్దమును మహాభాష్యకర్త యిట్లు ప్రయోగించి నాఁడు "ఏకశత మధ్వర్యుశాఖాః" (పస్పశాహ్నికము) పాణినిగూడ అధ్వర్యుక్రతు రనపుంసకమ్' అని సూత్రించెను. ఈ ప్రయోగములనుబట్టి ఛాందసములును లోకమునఁ గ్వాచిత్కములుగాఁ బ్రయోగార్హములని శరణదేవుఁ డిట్లు వ్యాఖ్యానించి యున్నాఁడు "ఛాందసా అపి భాషాయాం క్వచిత్ప్రయుజ్యంతే అధ్వర్యుశబ్దేన 'క్యాచ్ఛన్దసి' ఇత్యుప్రత్యయాంతేన జ్ఞాపితమ్" (దుర్ఘటవృత్తి)

కావ్యములలో నగపడుచున్న 'త్రియంబకమ్' - మొదలగు ఛాందసప్రయోగములు పైరీతిని పాణినీయమునుబట్టియే సాధువు లగుచున్నవి. హేతువాదమునుబట్టి పరిశీలించినను నిట్టివి యుక్తియుక్తములని మన మొప్పికొనక తప్పదు. కావ్యకర్తలు సాంగముగా నాఁడు వేదాధ్యయన మొనర్చిన మహానుభావులు వైదికకర్మాచరణముతోడనే తమ జీవితము

సార్థకపఱచుకొనిన శిష్టాచారపరాయణులు భవభూత్యాది మహాకవుల జీవితచరిత్రమును సంపూర్ణముగాఁ బరిశోధించినవారి కిది విదిత మగును ఇట్టి శ్రోత్రియోత్తముల రసనాగ్రమున వల దనినను వలచి ఛాందసవాణి తాండవింపక మానునా ? యుక్తియుక్తములు, సూత్రకృత్సమ్మతములు, మహాభాష్యానుగృహీతములు నగు నీ ప్రయోగములు పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనఁ జాలినవియా ?

## ౬ వ్యధికరణబహువ్రీహి-పాణినీయము

ఈ సందర్భమున శ్రీ శాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు. "వేయేల మనుమార్గుఁడు మున్నగు వ్యధికరణబహువ్రీహు లెల్ల నపాణినీయములే గదా" (పుట ౧౧౫) ఇట్లనుటలో శ్రీ శాస్త్రిగారి యాశయ మేమియో నాకుఁ దెలియదు పాణినీయానుశాసకులగు ముగ్గురు మహర్షులును నేకకంఠముగా వ్యధికరణబహువ్రీహి పాణినీయసమ్మత మని చెప్పియున్నారు. చూడుఁడు :

(౧) పాణిన్యాచార్యుఁడు 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అని సూత్రించి బహువ్రీహిలోని సప్తమ్యంతమునకుఁ బూర్వనిపాతము విధించెను. వ్యధికరణబహువ్రీహియే పాణినీయసమ్మతము కానప్పుడు బహువ్రీహిసమాసమున సప్తమ్యంతమే యసంభవము. సప్తమ్యంతమే యసంభవ మయినప్పుడు పై సూత్రమసంగతము కావున వ్యధికరణబహువ్రీహి సూత్రకారసమ్మత మని యొప్పికొనక తప్పదు.

(౨) వార్తికకారుఁడు 'సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తరపదలోపశ్చ' 'సముదాయవికార షష్ఠ్యాశ్చ' (బహుబ్రీహి ర్వక్తవ్యః) అని వార్తికముల రచించి వ్యధికరణబహుబ్రీహిని గంఠోక్తముగా విధించినాఁడు

(3) మహాభాష్యకర్త 'సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తరపదలోపశ్చ'—సప్తమీ పూర్వపద స్యోపమాన పూర్వస్యచ బహుబ్రీహి ర్వక్తవ్యః ఉత్తరపదస్యచ లోపో వక్తవ్యః కంఠేస్థః కాలోఽస్య కంఠేకాలః ఉష్ట్రముఖ మివ ముఖ మస్య ఉష్ట్రముఖః, ఖరముఖః 'సముదాయ వికార షష్ఠ్యాశ్చ' — సముదాయ వికారషష్ఠ్యాశ్చ బహుబ్రీహి ర్వక్తవ్యః ఉత్తరపదస్యచ లోపో వక్తవ్యః కేశానాం సమాహార శ్చూడా అస్య కేశచూడః, సువర్ణస్య వికారో ఽలంకారో యస్య సువర్ణాలంకారః" ఇత్యాది ' (౨-౨-౨-౨౪) అని పై వార్తికముల సోదాహరణములుగా వ్యాఖ్యానించినాఁడు ఇది గాక 'వ్యక్తవాచాం సముచ్చారణే' అను సూత్రము నీతఁడు వ్యాఖ్యానించుచు 'వ్యక్తాః వాచి వర్ణా యేషాం త ఇమే వ్యక్తవాచః' అను విగ్రహమును ప్రదర్శించి సూత్రములోని 'వ్యక్తవాచామ్' అనునది వ్యధికరణపద బహుబ్రీహిగానే యంగీకరించినాఁడు (౧-3-౨-౪౮)

.. ఇఁక శాస్త్రిగారు చూపిన 'మనుమార్గుఁడు' అనునది 'సప్తమ్యుపమానపూర్వపద స్యోత్తరపదలోపశ్చ' అను వార్తికముచే మనోః మార్గః మనుమార్గః, మనుమార్గ ఇవ మార్గః యస్య సః 'మనుమార్గః' అనువిగ్రహముతో భాష్యకర్తయీ వార్తికమున కుదాహరణ మొసఁగిన 'ఉష్ట్రముఖః' అను

దానివలె సమానాధికరణబహుప్రీహిగానే పాణినీయమున సాధితమైనది దీనిని శ్రీ శాస్త్రిగారు వ్యధికరణబహుప్రీహి యనుట ప్రమాదము వ్యధికరణబహుప్రీహులు కంఠేకాలా దులు. అవి మునిత్రయసమ్మతము లని నిరూపించితిని ఇట్లు మునిత్రయసమ్మతమగు వ్యధికరణబహుప్రీహి పాణినీయసమ్మ తమో పాణినీయవిరుద్ధమో బుద్ధిమంతు లూహింపుఁడు. ఈ రీతిని బాణినీయము సమన్వయించుకొనుటచేతనే యపాణి నీయము లగు పరశ్శతప్రయోగములు కావ్యములలో - వీరి కగపడినవేమో ?

## ౭. ద్వంద్వములోని యథాసంఖ్యము-పాణినీయము

"రామలక్ష్మణులు రావణేంద్రజిత్తులఁ జంపిరి- మొద లగు చోటులలో యథాసంఖ్యార్థకము లగు ద్వంద్వప్రయో గము లెల్ల నపాణినీయములేకదా అని శాస్త్రిగా రనుచు న్నారు అపాణినీయము లనుచు వీరు పైనిఁ జూపిన ద్వంద్వ ప్రయోగమునకు 'చంపఁబడినవారు రావణేంద్రజిత్తులు చంపినవారు రామలక్ష్మణులు' అను నర్థము పాణినీయవిరు ద్ధము కాదు రాముఁడు రావణుని, లక్ష్మణుఁడు ఇంద్రజిత్తును జంపెను అను కథాభాగ మాయాకావ్యములలోని పూర్వా పర సందర్భములఁబట్టియు, నాకథలకు మూలము లగు పురా ణాదులఁబట్టియు మనము తెలిసికొనవలయును కావ్యము లలోఁ గవు లసమగ్రముగా సూచించిన యితరవిషయము లెన్నియో పూర్వాపర సందర్భములఁ బరిశీలించియుఁ బురా ణముల నవలోడించియు మన మెఱుఁగునప్పు డీ సందర్భమున

మాత్ర మట్టిది కూడ దను సహృదయు లుండరు ఇట్లు యథా సంఖ్యార్థకము లగు ద్వంద్వప్రయోగము లన్నియుఁ బాణినీయము లగుచుండ 'రాముఁడు రావణాసురుని జంపెను, లక్ష్మణుఁడు ఇంద్రజిత్తును జంపెను' అనుటయే యిట వక్తృతాత్పర్యవిషయ మని విమర్శకులివి యన్నియు నపాణినీయము లనుట పాణినీయము కావ్యభాషానుశాసకము కా దను తమ సిద్ధాంతమును సమర్థించుకొనుటకే యని పాఠకలోక మిఁక నాకళింపకపోదు

## ౮ ద్విగుసమాసము-పాణినీయము

"త్రిలోకములు, చతుర్యుగములు త్రిపురుషులు, పంచపాండవులు మున్నగుప్రయోగము లెల్ల నపప్రయోగము లేకదా" అని శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు (పుట ౧౧౫) పైనుదాహరించిన శబ్దములన్నియు సంజ్ఞావాచకములు

(౧) త్రిలోకములు-ఈశబ్దముచే భూర్భువస్స్వర్లోకము లు మూఁడే వ్యవహరింపఁబడుచున్నవి ఏడులోకములలో నివిగాక తక్కిన యేమూఁడులోకములు నీశబ్దముచే బోధింపఁ బడవు కావున నిది సంజ్ఞావాచకము

(౨) త్రిపురుషులు-ఇది బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యందు రూఢము లోకమున నేముగ్గురు పురుషులనో బోధింప నిది సమర్థము కాదు కనుక నీశబ్దము సంజ్ఞావాచకము

(3) చతుర్యుగములు - జ్యోతిశ్శాస్త్రమున నైదు సంవత్సరములకు యుగ మను వ్యవహారము కలదు అట్టి యుగములు నాలు గీశబ్దముచే వ్యవహరింపఁబడవు కృత త్రేతా

ద్వాపర కలియుగముల నాలుగింటినే యీ శబ్దము బోధించును కావున నిది సంజ్ఞావాచకము

(ర) పంచపాండవులు-ఇది సంజ్ఞావాచకము పాండవులనిన పాండుని గోత్రాపత్యము (మనుమలు) కూడ నగును కావుననే శ్రుతకీర్త్యాదులు 'ఉపపాండవు' లనఁబడిరి ఇఁక పంచపాండవు లనిన ధర్మజ భీమార్జున నకుల సహదేవులే యగుదురు

సంఖ్యాపూర్వకము లగు నీసంజ్ఞావాచకములకుఁ బాణినీయమునఁ గర్మధారయసమాసము విధింపఁబడినది 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రముచేఁ గర్మధారయసమాసము రాఁగా 'త్రయశ్చ తే లోకాశ్చ-త్రిలోకాః' (త్రిలోకములు), 'త్రయశ్చ తే పురుషాశ్చ-త్రిపురుషాః' (త్రిపురుషులు), 'చత్వారశ్చ తే యుగాశ్చ-చతుర్యుగాః' (చతుర్యుగములు) 'పంచ చ తే పాండవాశ్చ-పంచపాండవాః (పంచపాండవులు) అను రీతి నీశబ్దములు పాణినీయముచేతనే సాధితము లైనవి 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్ అను సూత్రోదాహరణసందర్భమున నిట్టి శబ్దములే కాశికాకాముదులలో నుదాహరింపఁబడినవి (పంచామ్రాః, సప్తర్షయః మొ )

## మిసనేత్రి' ప్రభృతులు-పాణినీయము

'స్వాంగాచ్చోపసర్జనా దసంయోగోపధాత్' అను నీ పాణినిసూత్రము సంయోగోపధములకు జీప్ప్రత్యయము రా దనినది. సంయోగోపధక జీషంతములు లోకమునఁ గల

వని ముగ్ధబోధవ్యాకరణవ్యాఖ్యానకర్త శ్రీరామతర్కవాగీశుం డీక్రిందిరీతి నుదాహరించియున్నాఁడు.

అంగాంత్ర దంతకంఠం చ
శృంగకర్ణోష్ఠ మిత్యపి
పుచ్ఛనేత్రం తథా గాత్రం
జంఘ మంగాది రీతితః '

ఈకారికను బ్రదర్శించి శ్రీ శాస్త్రిగా రిట్లు వ్రాసిరి: "సంయోగోపధములలో జీప్ప్రత్యయము వచ్చున వింత యధికముగాఁ గావ్యభాషలో నగపడుచుండఁగాఁ బై పాణినిసూత్ర మెంతవఱకుఁ దదనుశాసనబుద్ధితో రచింపఁబడెనో బుద్ధిమంతు లూహింతురుగాక (పుట ౧౧౨)

ఇది యెంతవఱకు సత్యమో విమర్శింతము ముగ్ధబోధ వ్యాకరణవ్యాఖ్యానకర్త యుదాహరించిన శబ్దము లన్నియు శాస్త్రిగారు పాణినీయసాధితములు కా వనిరి ఈ వ్యాఖ్యానకర్త యుదాహరించినవి మొత్తము పదునొకండుశబ్దములు ఇం దాఱుశబ్దములు-దంత, శృంగ, కర్ణ, ఓష్ఠ జంఘా, పుచ్ఛ శబ్దములు-ప్రతిపదోక్తముగాఁ బాణినీయముచే నెట్లు సాధింపఁబడుచున్నవియో పరికింపుఁడు · నాసికోదరౌష్ఠ జంఘా దంత కర్ణ శృంగాచ్చ' 'పుచ్ఛాచ్చ' ఈ వ్యాఖ్యాత యుదాహరింపని మఱియొక సంయోగోపధమునుగూడ జీషంతముగా వార్తికకారుఁడు సాధించినాఁడు—'పక్షాచ్చ' (ఉలూక పక్షీ శాలా) ఇఁక నితఁ డుదాహరించినవానిలోఁ బాణినీయముచేఁ బ్రతిపదోక్తముగా సాధింపఁబడక మిగిలినవి యైదుశబ్దములు.

వీనిలో అంగ గాత్ర కంఠ శబ్దములు మూఁడు కాశికాకారుఁడు పాణినీయానుసారముగా సాధించినాఁడు ఈ సందర్భమున శాస్త్రిగారు 'చింతామణివిషయ పరిశోధనము' లోఁ బ్రదర్శించిన (పుట ౧౧౧) కౌముదీగ్రంథమున పుచ్ఛాచ్చ' అను వార్తికము 'అంగగాత్ర కంఠేభ్యో వక్తవ్యమ్ - స్వాంగీ స్వాంగేత్యాది' అను వృత్తి గ్రంథమధ్యపతితముగా నొనర్చి దీక్షితుఁడు ప్రమాదమనిన యంగాదులతో పాటు పుచ్ఛశబ్దమును గూడఁ బ్రమాద మనిరి చూ 'అత్ర వృత్తిః, అంగగాత్ర కంఠేభ్యో వక్తవ్యమ్ (పుచ్ఛాచ్చ) స్వాంగీ స్వాంగేత్యాది ఏత చ్చానుక్తసముచ్చయార్థేన (సూత్రస్థిత) చకారేణ సంగ్రాహ్య మితి కేచిత్ భాష్యాద్యనుక్తత్వా దప్రమాణమితి ప్రామాణికాః" (సిద్ధాంతకౌముది)

'పుచ్ఛాచ్చ' అనునది కాత్యాయనుని వార్తికమేకాని శాస్త్రిగా రనుకొనినట్లు కాశికాకారునికారిక కాదు సరిగా గ్రంథపరిశోధన మొనర్పక వీరు ప్రమాదపడినారు ఈవార్తిక ముదాహరణ ప్రత్యుదాహరణములతో మహాభాష్యమున వ్యాఖ్యానింపఁబడినది "(సూ) 'నాసికోదరౌష్ఠజంఘా దంత కర్ణశృంగాచ్చ' (వా) 'నాసికాదీనాం విభాషాయాం పుచ్ఛాచ్చ' - నాసికాదీనాం విభాషాయాం పుచ్ఛాచ్చేతి వక్తవ్యమ్ కల్యాణపుచ్ఛీ కల్యాణపుచ్ఛా (వా) 'కబరమణివిషశరేభ్యో నిత్యమ్—కబరమణి విషశరేభ్యో నిత్యమితి వక్తవ్యమ్ కబరపుచ్ఛీ (కబర) శరపుచ్ఛీ (శర), మణిపుచ్ఛీ (మణి) విషపుచ్ఛీ (విష) (వా) 'ఉపమానాత్పక్షాచ్చ పుచ్ఛాచ్చ'—ఉపమా

నా త్పతూచ్చ పుచ్ఛాచ్చేతి వక్తవ్యమ్ ఉలూకపక్షీ శాలా, ఉలూకపుచ్ఛీ సే నేతి" (౪-౧-౨-౫౫)

ఇఁక వృత్తికారుఁడు సాధింపఁగా మిగిలినవి అంత్ర, నేత్ర శబ్దములు రెండు ఈ శబ్దముల విషయమునఁ బాణినీయాశయ మేమియో విమర్శించుటకు ముందు 'అంగాది శబ్దసాధనసందర్భమున వృత్తిగ్రంథము ప్రామాదిక మనిన దీక్షితుని వచనము కవుల కెంతవఱకుఁ బ్రమాణము కాఁదగినదియో పరిశోధింతము అంగగాత్ర కంఠశబ్దములు సంయోగోపధములు 'స్వాంగాచ్చోపసర్జనా దసంయోగోపధాత్' అను సూత్రము సంయోగోపధములకు జీప్ప్రత్యయము రా దనుచున్నది 'కృశాంగీ' త్యాదుల మహాకవులు ప్రయోగించిరి ఈశబ్దముల సాధుత్వము నిరూపించుచు వృత్తికారుఁడు కాశికాగ్రంథకర్త సంయోగోపధములగు నోష్ఠాదులకుఁ గొన్నిటికి వికల్పముగా జీప్ప్రత్యయము విధించుచున్న 'నాసికోదరౌష్ఠ జంఘాదంత కర్ణశృంగాచ్చ' అను పాణినిసూత్రములోని చకారము విశేషార్థకము- సంయోగోపధములకు మఱికొన్నిటికిఁగూడ జీప్ప్రత్యయము వచ్చు ననునర్థము కలది - అని అంగాదులను వైకల్పికజీమంతములుగా సాధించినాఁడు 'అంగగాత్ర కంఠేభ్యో వక్తవ్యమ్' అను కాశికాకారుని వార్తికమునకుఁ గల యాశయ మిట్టిదని తద్వ్యాఖ్యానకారుఁ డగు న్యాసకారుఁడు—జినేంద్రబుద్ధిపాదుఁడు వివరించినాఁడు చూ: "అంగేతి-అంగాదిభ్య ఉపసర్జనేభ్యో జీష్ భవ తీత్యేతదర్థరూపం వ్యాఖ్యేయ మి త్యర్థః కిమర్థమ్? సంయోగోపధత్వాత్ జీష్ న ప్రాప్నోతి తదర్థమేత దర్థరూపం వ్యాఖ్యేయమ్ తదిదం వ్యాఖ్యానమ్. ఉత్తరసూత్రే

చకారోఽనుక్తసముచ్చయార్థః తే నాంగాదిభ్య స్స్వంయో గోపధేభ్యో జీష్ భవ తీతి'. చకారమున కిట్టి యర్థము భాష్యాదులలోఁ జెప్పఁబడనందునఁ బ్రామాణికు లొప్పికొన రని దీక్షితుఁడు 'అత్రవృత్తిః—' ఇత్యాదిగా వ్రాసెను కాని మహాభాష్య కర్త పాణినీయమునుగూర్చి యిట్లు ముచ్చటించెను. "ప్రమాణభూత ఆచార్యో దర్భపవిత్రపాణిః శుచావవకాశే ప్రాఙ్ముఖ ఉపవిశ్య మహతా ప్రయత్నేన సూత్రాణి ప్రణయతి స్మ తత్రాశక్యం వర్ణే నాప్యనర్థకేన భవితుమ్ కిం పున రియతా సూత్రేణ" (౧-౧-3-౧). ఈ మహాభాష్యమునుబట్టి శిష్టప్రయోగము లనేకము లగపడుచున్నప్పు డేప్రయోజనములేని 'నాసికోదరౌష్ఠ సూత్రస్థచకారము-విశేషార్థకము - అంగాదులకు మఱికొన్నిటికిఁ గూడ జీష్ప్రత్యయము వచ్చు ననునభిప్రాయము కలది—అని వ్యాఖ్యానించుట తప్పు కాదు. ఐనను సిద్ధాంతకౌముదీకర్త యగు దీక్షితుఁడీనాఁ డిది భాష్యానుక్త మగుటచేఁ బ్రమాదమనినాఁడు ఇదియే సిద్ధాంత మనుకొందము ఐనను వృత్తికారుఁడు మొదలు దీక్షితునివఱకును గల మహాకవులు తమనాఁ డప్రతిహతముగాఁ బాటింపఁబడుచున్న వృత్తికారసిద్ధాంతమును బ్రమాణముగాఁ గొని అంగ, గాత్ర కంఠ శబ్దములు జీషంతములుగాఁ బ్రయోగించుట తప్పనఁ జాలము ఈనాఁడు కౌముదివలె నానాఁడు వృత్తిగ్రంథమును బరనపారనాదులలోఁగల దను ప్రసిద్ధి కలదు ఈనాఁడు కౌముది చదివి పై వ్యాఖ్యానములు చదువక కొందఱును, జదివినను నాగేశాదుల నవీనమతములు సరిగా వని మఱికొందఱును దీక్షితాదుల

సిద్ధాంతములకే యలవడి కావ్యములు వ్రాయుచుండుట మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము ఈపట్టున యఙ్లుగంత ప్రయోగమును నిదర్శనముగాఁ గొనుఁడు ఈ ప్రయోగమునుగూర్చి మహాభాష్యమున నిట్లున్నది. "ఏవంతర్హి సిద్ధే సతి య ద్ధుశ్ఛ్న గ్రహణం కరోతి తజ్ జ్ఞాపయ త్యాచార్యః యఙ్లుగ్ భాషాయాం భవ తీతి కి మేతస్య జ్ఞాపనే ప్రయోజనమ్? చేభిదీతి చేచ్ఛిదీ తీత్యేత త్సిద్ధం భవతి భాషాయామపి" (౬-౪-3-౮౭) ఇట్లు స్పష్టముగా యఙ్లుగంతము లోకమునఁ బ్రయోగార్హమని మహాభాష్యకర్త చెప్పుచున్నను నీ ప్రయోగము ఛాందస మని మఱియొక భాష్యమునుబట్టి నాగేశభట్టు సిద్ధాంత మొనర్చెను ఇఁక దీక్షితుఁడో, యీభాష్యమే సిద్ధాంతభాష్య మని యఙ్లుగంత ప్రయోగము లౌకిక మను సిద్ధాంతమును స్థాపించుటయేగాక తన శబ్దకౌస్తుభప్రారంభమున "విశ్వేశం సచ్చిదానందం వందేఽహం యోఽఖిలంజగత్, చర్కర్తి జరీహర్తి సంజరీహర్తి లీలయా" అని స్వయముగాఁ బ్రయోగించినాఁడు దీక్షితునకుఁదరువాతివాఁడగు నాగేశభట్టీప్రయోగము ఛాందస మనినను దరువాతి మహాకవు లీసిద్ధాంతము పాటింపక నాఁటినుండి నేఁటివఱకును యఙ్లుగంతములఁ బ్రయోగించుచున్నారు ఇట్లే 'కంబుకంఠీ' ఇత్యాదులు దీక్షితుఁడు తప్పనినను బాణినీయము కావ్యభాషానుశాసక మను పాణినీయులే యీ సిద్ధాంతము నాదరింపక వృత్తికారమతానుయాయులై 'కంబుకంఠీ' ఇత్యాదులే ప్రయోగించుచున్నారు. దీనినిబట్టి మన మిట్లూహింపవచ్చును లక్ష్యము లనేకములు ప్రదర్శించి లక్షణము తదనుగుణముగా నున్న దని యొక

వ్యాఖ్యాత వ్యాఖ్యానించినప్పు డావ్యాఖ్యానము కేవలలక్షణ దృష్టితోఁ బ్రమాదమని తరువాతివారు నిరూపించినను ద్వరలో నావ్యాఖ్యానము ప్రమాణపదము నధిష్ఠింపదు ప్రామాణికులగు వ్యాఖ్యాతల భిన్నభిన్న వ్యాఖ్యానములు శాస్త్రసంప్రదాయమునుబట్టి మతభేదములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి చూ కైయటమతము వృత్తికారమతము, దీక్షితమతము నాగేశమతము మొ ఈ మతములలో నే మతము ననుసరించినను నామతము శాస్త్రవిరుద్ధము కాదు. కావున లక్ష్యలక్షణముల సమన్వయించుచుఁ బాణినీయము నకు వ్యాఖ్యాన మొనర్చిన యొకవ్యాఖ్యాతను బ్రమాణ ముగాఁ గొని తదనుసారముగాఁ గవులు ప్రయోగించిన 'కృశాంగీ' ఇత్యాదులు పాణినీయము లనవలసినవియేగాని అపాణినీయము లని నిరాకరింపవలసినవి కావు తమకాలము నకుఁ బాణినీయవ్యాఖ్యానములలో నెల్ల వృత్తి న్యాస గ్రంథ ములకుఁ గల ప్రాశస్త్యమును గవు లెట్లుద్ఘాటించుచున్నారో పరికింపుఁడు. 'అనుత్సూత్రపదన్యాసా* సద్వృత్తి† స్సన్ని బంధనా, శబ్దవిద్యేవ నో భాతి రాజనీతి రపస్పశా''(మాఘము, ౨-౧౧౨) ఇట్లు వృత్తికారునినుండి దీక్షితునివఱ కుండు మహాకవులును దరువాతివారును 'నతాంగీ' ఇత్యాదులు

---

* ఇష్ట్యుపసంఖ్యాన నైరపేక్ష్యేణ సూత్రాక్షరై రేవ సర్వార్థ ప్రతిపాదకో న్యాసగ్రంథః యస్యాం సా .. ..

† 'సతీ వృత్తిః కాశికాఖ్య సూత్రవ్యాఖ్యాన గ్రంథవిశేషః యస్యాం సా ' (మల్లినాథవ్యాఖ్య).

ప్రయోగించుట పాణినీయవిరుద్ధము కాదు వృత్తిగ్రంథమున కిప్పుడు జరగిన కాలనిర్ణయము సరికాదు ఈ గ్రంథము చాలఁ బ్రాచీనమైనది ఇఁక వృత్తికారునకును బూర్వికు లగు మహాకవులు 'సుగాత్రీ' ఇత్యాదుల నెట్లు ప్రయోగించి రని మనము చర్చింపవలసియున్నది పాణినీయమున కానాఁ డేయే వ్యాఖ్యానములు కలవో యావ్యాఖ్యానము లీ సూత్రముల కే మని వ్యాఖ్యాన మొనర్చినవియో మన కీనాఁడు తెలియ రాదు కాని పాణినీయపారంగతులని తమ కావ్యము లెల్లఁ బ్రత్యక్షసాక్ష్య మిచ్చుచున్న ప్రాచీనమహాకవు లైన నీ జీషంతముల నిట్లు ప్రయోగించుట కేదేని కారణ ముండక పోదు. దానిని మన మిట్లూహింపవచ్చును వృత్తికారుఁడు సాధింపఁగా మిగిలిన 'అంత్ర నేత్ర'శబ్దముల రెంటిని బాణినీయ మె ట్లనుశాసించినదియో తత్సాధనప్రకారముగూడ నీ సంద ర్భముననే పాఠకులకు విశదపడును

### నే త్ర శ బ్ద ము :

పాణిని కరణార్థమున నీఞ్ ధాతువునకంటె ష్ట్రన్ ప్రత్య యము విధించి నేత్రశబ్దమును సాధించినాఁడు. చూ 'దా మ్నీశస యుయుజ స్తుతుద సిసిచ మిహ పత దశ నహః కరణే (3-౨-౧౮౨) ఈష్ట్రన్ప్రత్యయము షిత్తు షిత్త్వము ప్రత్యయమాత్రవృత్తి ధర్మము కాకపోవుటనుబట్టి ప్రత్యయ గ్రహణపరిభాష యిటఁ బ్రవర్తింపదు కావున 'మీననేత్ర' ఇత్యాదులు షిదంతములు అనుపసర్జనాధికారము తదంత విశే

వణము * 'మీననేత్ర' ఇత్యాదులలోని నేత్రశబ్దాదు లుప సర్జనములే యైనను 'మీననేత్ర ప్రభృతులు విశిష్టము లనుప సర్జనములు అనుపసర్జనములగు షిదంతములకు 'షిద్గౌరాది భ్యశ్చ' అను సూత్రముచేఁ బాణినియే జీప్ప్రత్యయము విధించినాఁడు ఇట్లు పాణినీయానుశిష్టము లగుట పరికించియే మహాకవులు వీనిని స్వకావ్యములలోఁ బ్రయోగించిరి ఇవి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనఁ జాలినవి కావు

## అంత్రశబ్దము

అమ గతౌ అను ధాతువునకు 'అమిచిమిదిశాసి భ్యః క్త్రః అను నుణాదిసూత్రముచే 'క్త్ర' ప్రత్యయము వచ్చిన 'అంత్రమ్' అని యగును ఈ 'క్త్ర' ప్రత్యయాంత మునకు స్త్రీలింగమున 'స్థూలాంత్రా వంటి టాబంతరూప ములు నిర్బాధములు ఇఁక 'అతి బంధనే అను ధాతువునకు 'సర్వధాతుభ్యః ష్ట్రన్' అనుసూత్రమున 'ష్ట్రన్' ప్రత్యయము వచ్చినను 'అంత్రమ్ అని యగును ఈ ష్ట్రన్ ప్రత్యయాంత ముతో సమాస మేర్పడిన 'మీననేత్రీ అనువానివలెనే 'స్థూలాంత్రీ'వంటి జీషంతములును పాణినీయమునుబట్టి యేర్ప డుట ప్రక్రియామర్మజ్ఞు లెఱుఁగనిది కాదు ఇట్లుభయవిధము

* 'విభాషా సపూర్వస్య' (४-१-३४)— అనుపసర్జనస్య'ఇ తిహోత్తరార్థ మనువృత్త మపి న పత్యు ర్విశేషణమ్ కింతు తదంతస్య. తేన బహువ్రీహావపి దృఢపత్నీ, దృఢపతిః, వృషలపత్నీ, వృషలపతిః (కౌముది, స్త్రీప్రత్యయప్రకరణము)

లగు వ్యుత్పత్తితోఁడ నీశబ్ద మమరసుధాకారుఁడే వ్యాఖ్యానించినాఁడు

అంగ శబ్దము

ఉణాదులలో నీశబ్దము ప్రతిపదోక్తముగా సాధింపఁబడలేదు ఈ శబ్దసాధనమున వ్యాఖ్యాతలు భిన్నభిన్నమార్గములు త్రొక్కిరి అగిధాతువుకంటె అచ్ప్రత్యయము అని అమరసుధ అమధాతువుకంటె 'బాహుళకాద్గః' అని వాచస్పత్యము అగిధాతువుకంటె ఘప్రత్యయము, లేక ఘఞ్ ప్రత్యయము, లేక అమధాతువుకంటె గఃప్రత్యయము అని లఘుశబ్దార్థసర్వస్వము కాని ప్రామాణికము లగు శిష్టప్రయోగములనేకము లగపడుచున్నప్పుడు ఉణాదయో బహుళమ్ అను సూత్రమున మహాభాష్యకర్త '"ప్రకృతిం దృష్ట్వా ప్రత్యయ ఊహితవ్యః ప్రత్యయంచ దృష్ట్వా ప్రకృతి రూహితవ్యా" "సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతః పరే కార్యాద్విద్యా దనూబంధ మేత చ్ఛాస్త్ర ముణాదిషు'. అని యభ్యనుజ్ఞ యిచ్చిన రీతిని 'అగి కంపనే అను ధాతువుకంటె షిత్తగు ప్రత్యయ మొకదానిని వికల్పముగా విధించుకొని 'అంగ' శబ్దము సాధించుకొనిన 'కృశాంగీ కృశాంగా' యిత్యాదులును పాణినీయమువలననే సాధితము లగుచున్నవి కనుకనే నిగమాంత దేశికులు తన తత్త్వటీకయం దిట్టివానినిగూర్చి యిట్లు చెప్పినాఁడు (చూ॰ శిష్టప్రయోగ సంగ్రహము)·

"ఈదృశానాం ప్రయోగాణా, మబహిష్కారసిద్ధయే
బహుధా బహుళాదీనా, మష్టాధ్యాయ్యా ముపక్రమః.

విశిష్టోక్త్యనుసారేణ వ్యుత్పత్తి స్స్మర్యతే బుధైః।
అవిగీతప్రయోగేషు, విగానం నైవ సాంప్రతమ్"

గాత్రశబ్దము.

ఈశబ్ద మునాదులలో 'గమ్లు' ధాతువుకంటె పిత్తగు 'ష్ట్రన్' ప్రత్యయము రాఁగా సిద్ధించిన దని ప్రతిపదోక్తముగా నిట్లు సూత్రింపఁబడినది 'సర్వధాతుభ్యః ష్ట్రన్', 'ప్రత్యయమిన మిహానివిశ్యశాం వృద్ధిశ్చ'—ప్రాప్తః గాత్రమ్ ఇట్లు ష్ట్రన్ ప్రత్యయాంతమగు గాత్రశబ్దముతో సమాస మేర్పడఁగా మీనసేత్రీశబ్దసాధనసందర్భమున నా చూపినరీతిని షిదంతము లయిన 'సుగాత్ర' ఇత్యాదులకును 'షిద్గౌరాదిభ్యశ్చ' అను సూత్రమున జీష్ప్రత్యయము వచ్చి 'సుగాత్రీ' ఇత్యాదులు పాణినీయసాధితము లైనవి. ఈశబ్దము 'ష్ట్రన్' ప్రత్యయాంత మని అమరసుధాకారుఁడు నయితము వ్యాఖ్యానించినాఁడు

'ష్ట్రన్' ప్రత్యయాంతముగాఁ గాక 'త్రన్' ప్రత్యయాంతముగాఁ గూడ నీశబ్ద మునాదులలో ననుశాసింపఁ బడినది 'హుయామాశ్రుభసిభ్య స్త్రన్' 'గమే రా చ'- గాత్రమ్' త్రన్ప్రత్యయాంత మగు నీ గాత్రశబ్దము సుశబ్దాదులతో సమసించి స్త్రీలింగమున టాబంతము కాఁగా 'సుగాత్రా' ఇత్యాదులును పాణినీయసిద్ధము లైనవి

కంఠశబ్దము.

'కణే ష్ఠః' అను నుణాదిసూత్రము కణధాతువునకంటె 'ష్ఠ' ప్రత్యయము విధించి దీనిని సాధించుచున్నది పై సూత్ర మును 'కణేః ఠః', 'కణేః ష్ఠః' అని యుభయవిధములుగాను



ఛేదింపవచ్చును 'కణేః ష్ఠః' అని ఛేదించినప్పుడు 'ఖర్పరే శరి వా విసర్గలోపో వక్తవ్యః' అను వార్తికముచే విసర్గము లోపించును ఇటఁ గర్త్రభిప్రాయ మేమియో యెఱుఁగ రాకుండుటనుబట్టి లక్ష్యానుసారముగా నాఁ డేర్పడిన యుభయ విధవ్యాఖ్యానములు ప్రమాణములుగాఁ గాని 'సుగాత్రీ' 'సుగాత్రా' అనువానివలె 'కంబుకంఠీ' 'కంబుకంఠా' అను వానిఁగూడ మహాకవులు ప్రయోగించిరి. పాణిని నేత్రశబ్దము నొకదానిని దృష్టాంతీకరించి యీ శబ్దముల నిట్లు సాధింపుఁ డని మార్గ మేర్పఱచినాఁడు పాణినికిని ప్రాచీనుఁ డగు శాకటాయనుని యుణాదిసూత్రము లీ శబ్దముల నిట్లు సాధింపఁగలి గినవి

## ఉణాదులు

వ్యాకరణకర్తలలో శాకటాయనుఁ డొకఁడు ఇతఁడు పాణినికంటెను ప్రాచీనుఁడు ఉణాదుల నీతఁడే రచించినాఁడు 'ఉణాదయో బహులమ్ మొదలగు నిదర్శనములనుబట్టి పాణి నీయాంగముగానే శాస్త్రకర్త లీయుణాదులఁ బరిగణించిరి మహాకవులును నిట్లే యభిప్రాయపడిరి 'నిపాతిత సుహృత్స్వా మి పితృవ్య భ్రాతృ మాతులమ్, పాణినీయ మి వాలోచి ధీరై స్తత్సమరాంగణమ్' (మాఘము, ౧౯-౭౫) ఈ శ్లోకము లోనిభ్రాతృశబ్దము'నప్తృనేష్ట్రుత్వష్ట్రుహోతృభ్రాతృజామాతృ పితృదుహితృ' అను నుణాదిసూత్రముచే నిపాతితము ఐనను బాణినీయ మనియే యీ మహాకవి యనుచున్నాఁడు ఇది గాక పాణిని శాకటాయనసిద్ధాంతములను దన యనుశాసన

మునఁ బేర్కొని లక్ష్యవ్యవస్థ నేర్పఱచినాఁడు ('ర్వ్యోర్లఘు ప్రయత్నతరశ్శాకటాయనస్య లః శాకటాయనస్యైవ'మొ) తాను సాధింపక విడిచిన శిష్టప్రయోగములు శాకటాయనాది సూత్రములచే సాధింపఁబడవలసిన వని పాణిని యిట్లు సూత్రించినాఁడు "పృషోదరాదీని యథోపదిష్టమ్—కై రుపదిష్టమ్? శిష్టైః కే పునశ్శిష్టాః? వైయాకరణాః ఇత్యాది' (మహాభాష్యము) ఇక్కడ శిష్టు లనఁబడినవా రిట్టి వ్యాకరణకర్తలే

కావున ముగ్ధబోధవ్యాకరణ వ్యాఖ్యానకర్త యుదాహరించిన సంయోగోపధక జీమంతము లన్నియుఁ బాణినీయమును బట్టియే యిట్లు సాధితము లైనవి ఇవి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దను సిద్ధాంతమునకు దృష్టాంతము లెట్లుకాఁగలవు?

**అంగాదిశబ్దములు-శాకటాయనము :**

అంగాదులను శాకటాయన మిఁక నె ట్లనుశాసించిన దియో యవలోకింపుఁడు 'అసహనఞ్ విద్యమానా న్నాసికోదరోష్ఠ జంఘాదంత కర్ణశృంగాంగగాత్రకంఠా బహ్వాచ్ సంయోగోపాంత్యాత్స్వాంగా త్సమాసాత్ (౧-3-౨౭) - సహనఞ్ విద్యమానవర్జితా దస్వాంగవాచినః పరరా య న్నాసికాది యచ్చాబహ్వాచ స్సంయోగోపాంత్యా చ్చాన్యస్మా త్స్వాంగవాచి తదంతా దదంతా త్సమాసాత్ స్త్రియాం జీ వా భవతి—దీర్ఘనాసికా, తలోదరీ - తలోదరా, బింబోష్ఠీ - బింబోష్ఠా, సమజంఘీ - సమజంఘా, చారుదంతీ - చారుదంతా, లంబకర్ణీ - లంబకర్ణా, పటుశృంగీ - పటుశృంగా;

నతాంగీ - నతాంగా, తనుగాత్రీ - తనుగాత్రా; కలకంఠీ - కలకంఠా ఇత్యాది (శాకటాయనము). చూచితిరా శాకటాయన మెట్లీశబ్దముల ననుశాసించినదియో

## ౧౦ ఆమంతము - వ్యవహిత ప్రయోగము

ఈ సందర్భమున సూత్రకారుఁడు 'కృఞ్చానుప్రయుజ్యతే లిటి' అని సూత్రించెను వార్తికకారుఁడు 'విపర్యాస నివృత్త్యర్థం వ్యవహితనివృత్త్యర్థం చ' అను వార్తికమును రచించి 'ఆమంతము'నకు ధాతువుతోడి వ్యవహితప్రయోగము దుష్ట మనెను వార్తికకారుఁ డొనర్చిన యీప్రయోగ నియమము పాటింపక 'కృన్మేజంతః' అను సూత్రమునఁ - బద త్వము గలదు గదా యని కవు లామంతమును యథేచ్ఛముగాఁ బ్రయోగించిరి. 'తం పాతయాం ప్రథమమాస పపాత పశ్చాత్' 'ప్రభ్రంశయాం యో నహుషం చకార' (రఘుః), 'ఉషాం * ప్రచక్రు ర్నగరస్య మార్గాన్' (భట్టిః)—ఇవి యన్నియు వార్తికవిరుద్ధము లగుటనుబట్టి యపాణినీయములని శ్రీ శాస్త్రిగా రనిరి (పుట ౧౧౨). సూత్రకారాశయ మిట్టి దని వార్తికకారుఁ డెఱుకపఱుపనంతవఱకును మహా

* 'ఉషాన్' అనునది ముద్రితపాఠము ఇక్కడ జయమంగళుఁడు "ఉషాన్ = సేకవతః ప్రచక్రుః ఉక్షణ ముక్షా 'గురోశ్చ హలః' ఇత్యాకారః సా విద్యతే యేషామితి అర్శఆదిభ్యోఽచ్' ఇజాదేశ్చ గురుమత' ఇత్యాదినా ఆమ్'ప్రత్యయే ప్రచక్రు రి త్యనుప్రయోగో న ఘటతే. 'కృఞ్చానుప్రయుజ్యతే ఇత్యనుశబ్దస్య వ్యవహితనివృత్త్యర్థత్వాత్'' అని వ్యాఖ్యానించినాఁడు

కవులు 'కృన్మేజంతః' అను సూత్రమునఁ బదత్వము గల దని ఆమంతమును యథేచ్ఛముగాఁ బ్రయోగించుట దోషముగాక పోయినను వార్తికకారునకుఁ దరువాతి మహాకవుల కావ్యములలో నిట్టివి గానఁబడునప్పు డవి యెట్లేర్పడిన వని మనము విమర్శింపవలసియున్నది నావిమర్శనమునకు ముం దిట్టిప్రయోగముల మఱికొన్నిటిఁగూడ నిటఁ బ్రదర్శించెదను 'మాతృష్వసా మాతృసమప్రభావా సంవర్ధయామాత్మజవ ద్బభూవ', 'దివ్యైర్వి శేషైః ర్మహయాం చ చక్రుః, 'ప్రత్యర్చయాం ధర్మభృతో బభూవ' (బుద్ధచరితము) 'సంయోజయాం విధివదాన సమేతబంధుః' (రఘువంశము), 'తమపి చులుకయాం కుంభయోని శ్చకార' (కువలయానందము) కావ్యకర్తలగు మహాకవు లీయామంతము నిట్లు ప్రయోగించుటకుఁ గల పరమార్థ మేమియో మన మింకఁ గనుఁగొందము శరణదేవుఁ డీప్రయోగముల నిట్లు సాధించినాఁడు . "కృఞ్చానుప్రయుజ్యతే లిటి - కథమ్? 'తం పాతయాం ప్రథమ మాస పపాత పశ్చాత్' ఇతి రఘుః' అమ్ప్రత్యయస్యైవేతి న్యాసేఽవధారణాత్ ఉచ్యతే పాతశబ్ద ఉపపదే యాతేర్డ్వాచి ద్వితీయాంతం పాతయామ్ పాతం యాంతమిత్యర్థః. ఆసేతి. అస గత్యాదే రూపమ్; ప్రాప్తవా నిత్యర్థః యద్వా - అమ్ప్రత్యయాంతస్య క్రియాసాధనప్రధానత్వా త్తథావిధస్యైవ వ్యావృత్తిః ప్రథమమితి తు క్రియావిశేషణమ్ న సాధనప్రధానమ్. ఏవం 'సంభావయాం రాఘవ మాస వృష్టే' రిత్యపి సిద్ధమ్ (దుర్ఘటవృత్తి)

ఈ ప్రయోగములనుగూర్చి హారదత్తుఁ డిట్లు ప్రసంగించినాఁడు "కథం భట్టికావ్యే 'ఉషాం ప్రచక్రు ర్నగరస్య

మార్గాః' బిభయాంప్రచకారాసావితి కథం వా 'తం పాతయాంప్రథమమాస' 'ప్రభ్రంశయాం యో నహుషం చకార' ఇతి వార్తికకారః పృచ్ఛ్యతామ్-యః పఠతి, 'విపర్యాసనివృత్త్యర్థం వాచ్యమ్ వ్యవహితనివృత్త్యర్థం చేతి" (పదమంజరి)

మహాభాష్యకర్త ప్రకృతవార్తికము నీ క్రిందిరీతిని వ్యాఖ్యానించినాఁడు · 'విపర్యాసనివృత్త్యర్థంవా-విపర్యాసనివృత్త్యర్థం తర్హి కృఞోఽనుప్రయోగవచనం క్రియతే ఈహాంచక్రే చక్రే ఈహామితి మాభూత్ 'వ్యవహితనివృత్త్యర్థంచ —వ్యవహిత నివృత్త్యర్థం చ కృఞోఽనుప్రయోగవచనం క్రియతే అన్వేవ చాఽనుప్రయోగో యథా స్యాత్ ఈహాంచక్రే వ్యవహితస్య మా భూత్ ఈహాం దేవదత్తశ్చక్రే (౩-౧-౩-౪౦)

ఇతఁడు మఱియొకచో లిడంతమునకు నఞ్తో సామర్థ్యప్రదర్శన మొనర్చుచు నిట్లు ప్రయోగించినాఁడు: "న కారయామ్ న హారయామ్-నాఽత్ర నఞ ఆమంతేన సామర్థ్యమ్, కేన తర్హి? లిడంతేన. 'న చకార కారయామ్, న చకార హారయామ్" (మహాభాష్యము, ౨-౪-౨-౮౧)

ఈ మహాభాష్యకార ప్రయోగము లౌకికము గా దని కైయటుఁడిట్లు వ్యాఖ్యానించినాఁడు: "న చకారేతి నఞో లిడంతేన సామర్థ్యం ప్రదర్శయతి నత్వయం లౌకికః ప్రయోగో వ్యవహిత విపర్యస్త ప్రయోగనివృత్త్యర్థత్వా దనుప్రయోగారంభస్య' (మహాభాష్యము ౨-౪-౨-౮౧ సూ కైయటము )

కైయటుఁ డిట్లు వ్యాఖ్యానించినను గైయటునికంటెఁ బ్రాచీనులగు పైమహాకవులు 'న చకార కారయామ్' 'న చకార హారయామ్' అను మహాభాష్యప్రయోగములఁబట్టి ప్రకృతవార్తిక తద్వ్యాఖ్యాన మహాభాష్యములు ప్రాయికము లనుకొని పైరీతిని బ్రయోగించియుండవచ్చును 'తాన్ స రాజా మదయామేవ చకార' అని బహ్వృచబ్రాహ్మణమునఁ గలదు ఇందలి యామంత వ్యవహిత ప్రయోగమును గాంచి శ్రోత్రియోత్తములగు మహాకవులు పైరీతిని బ్రయోగించినను బ్రయోగింపవచ్చును ఏమైన నివి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనుటకుఁ దగిన ప్రమాణములు కావు.

## ౧౧ సౌత్రప్రయోగములు-పాణినీయము

'ఇకో యణచి' 'సనాద్యంతా ధాతవః' 'సుప్తిఙంతం పదమ్ అను పాణినిసూత్రప్రయోగము లెల్ల సౌత్రము లగుటచేఁ గదా సాధువు లగుచున్నవి? ఇట్టివి పెక్కుగలవు ఇట్టి వాని సాధుత్వమును బాణినీయ వ్యాకరణమునుబట్టి విమర్శించుట యుక్తము కాదు గదా (చింతా. పుట ౧౧౫) 'ఝయో హోన్యతరస్యామ్' 'ఖరి చ' 'అనచి చ' 'యణో మయో ద్వే వాచ్యే' 'అచో రహాభ్యాం ద్వే' దచి జము ణ్ణిత్యమ్ అను పాణినీయసూత్రమునుబట్టి పై సూత్రము లన్నియు 'ఇకో యణ్ణచి' 'సన్నాద్యంతా ధాతవః' 'సుప్తిఙ్ఙంతం పదమ్ అనురీతి నేర్పడవలసినవి ఐనను వైదికకర్ణోన్నపయోగిశిష్టవ్యవహారభాష నే లక్ష్యపథమం దుంచుకొనినపాణిని తన సూత్రములకు సయితము తమ యనుశాసనము ప్రమాణమని భావింపలేదు ఈ యాశయము నెఱుఁ

గక సౌత్రత్వాత్సాధువులని వీనిని వ్యాఖ్యాతలు సమర్థింపఁ జూచి రనునది శాస్త్రిగారి వాదసారాంశము ఇట్టి యభిప్రాయమే సత్య మయిననాఁడు పాణిని ప్రత్యేక మనుశాసన మేర్పఱపకపోయినను పాణినిసూత్రప్రయోగములఁబట్టి పాణినీయలక్ష్యములు సాధువు లని సాధించుట తప్పు కాకపోదు. ఇట్లు సాధించినవారు వ్యాఖ్యాతలు కారు మునిత్రయము వారిలో నొకఁడగు మహాభాష్యకర్త మునిత్రయము వారి యాశయ మెఱుఁగక తరువాతివారు పొరపడినారని శాస్త్రిగా రనుచున్నారేకాని మునిత్రయమువారే పొరపడినా రని వీ రింకను నన సాహసింప లేదు. ఇఁక సూత్రనిర్దేశములను బట్టి మహాభాష్యకర్త పాణినీయలక్ష్యముల నెట్లు సాధించి యున్నాఁడో గమనింపుఁడు

(౧) "స్త్రీవత్, పుంవత్. ఆచార్యప్రవృత్తిః జ్ఞాపయతి న వత్యర్థే నఞ్స్నఞౌ భవత ఇతి యదయం 'స్త్రియాః పుంవ' దితి నిర్దేశం కరోతి ఏవమపి స్త్రీవదితి న సిద్ధ్యతి. యోగాపేక్షం జ్ఞాపకమ్" (మహాభాష్యము ౪-౧-౩-౧౧౮).

'స్త్రీ పుంసాభ్యాం నఞ్స్నఞౌ భవనాత్' అను సూత్రముచొప్పున వతిప్రత్యయబాధకములుగా నఞ్స్నఞ్ ప్రత్యయములు వచ్చి 'స్త్రియా తుల్యః, పుంసా తుల్యః' అను నర్థమున, 'స్త్రైణః' 'పౌంస్నః' అను రూపములే పాణినీయమును బట్టి యేర్పడుచున్నవి 'పుంసా తుల్యః పుంవత్, స్త్రియా తుల్యః స్త్రీవత్' అను రూపములు సుప్రసిద్ధములు. ఈరూపములు పాణినీయమునుబట్టి యెట్లు సాధువులగునని వైభాష్యమున నాశంకించి 'స్త్రియాః పుంవత్' అనుసూత్రప్రయోగ

మునుబట్టి వతిప్రత్యయమునకు నఞ్స్నఞ్ ప్రత్యయములు బాధకములు గావనుటయే పాణినిసమ్మతమని పతంజలి పై లక్ష్యముల సాధించినాఁడు

(౨) "కథమాశీరితి? నిపాతనాత్సిద్ధమ్, కిం నిపాతనమ్? 'క్షియాశీః ప్రైషేషు తిఙాకాఙ్క్ష'మితి" (మహాభాష్యము ౬-౪-౨-౩౪)

ఆశీశ్శబ్దమును పై సూత్రనిర్దేశమునుబట్టి పతంజలి సాధించినాఁడు

(3) " 'వయసి ప్రథమే'—'ఇహాఽపి తర్హి ప్రాప్నోతి కన్యేతి నిపాతనాదేత త్సిద్ధమ్ కిం నిపాతనమ్? 'కన్యాయాః కనీన' చేతి" (మహాభాష్యము ౪-౧-౨-౨౦)

'వయసి ప్రథమే' అను సూత్రమున 'కన్యా' అనుచో ఙీప్ప్రత్యయము వచ్చు నని యాశంకించి పై సూత్రనిర్దేశమునుబట్టి రాదని ప్రత్యుత్తరించినాఁడు

(౪) " 'శాశ్వతికే ప్రతిషేధః—శాశ్వతికే ప్రతిషేధో వక్తవ్యః న వక్తవ్యః 'నిపాతనాత్సిద్ధమ్' నిపాతనాదేతత్సిద్ధమ్ కిం నిపాతనమ్? 'యేషాం చ విరోధశ్శాశ్వతికః' ఇతి" (మహాభాష్యము ౬-౪-౪-౧౪౪)

ఈ మహాభాష్యమునఁ బతంజలిభగవానుఁడు ప్రత్యేకవిధానము లేకున్నను పై సూత్ర ప్రయోగమునుబట్టియే శాశ్వతికశబ్దము సాధు వనినాఁడు (ఇట్టి వనేకములు).

ఈ రీతిని సూత్రప్రయోగములఁబట్టి మహాభాష్యకర్తయే గాక 'సమునే' సూత్రభాష్యమునఁ బతంజలి తమకాదేశించినట్లు వ్యాఖ్యాతలగు కైయటాదులు సయితము

మహాభాష్యప్రయోగములఁబట్టి లక్ష్యసంస్కార మెట్లొనర్పఁ గడఁగినారో తిలకింపుఁడు

(౧) 'ఓషధి వనస్పతీనాం వృద్ధిహ్రాసౌ' 'జ్యోతిషాం గతి రితి' (౫-౧-౨-౧౧౯) అత్ర కైయటః భాష్యకారవచనాత్ 'జాతిరప్రాణినా' మిత్యేకవద్భావో న భవతి

'జాతి రప్రాణినామ్' అను సూత్రమునుబట్టి 'ఓషధి వనస్పతీనామ్' అను భాష్యప్రయోగ మసాధు వగుచుండఁ గైయటుఁడు పైసూత్ర మనిత్య మని యీ ప్రయోగమును సాధించినాఁడు

(౨) ఏవం తర్హి 'శాశ్వతే ప్రతిషేధః' శాశ్వతే ప్రతిషేధో వక్తవ్యః శాశ్వతమ్ (మహాభాష్యము ౬-౪-౪-౧౪౪) అత్ర కైయటః—'శాశ్వత మితి భాష్యకారవచనప్రామాణ్యా దణ్ ప్రత్యయః'

అత్ర ఉద్ద్యోతకారః 'రఞా బాధా దణ్ దుర్లభోఽత ఆహ 'భాష్యకారేతి' తత్ప్రామాణ్యా త్సంధివేలాదిగణే 'శశ్వతో వే'తి పాఠానుమాన మితి భావః

పాణినీయమునుబట్టి లోకసుప్రసిద్ధ మగు శాశ్వత శబ్ద మసాధు వగుచుండఁ బై భాష్యకారప్రయోగమును బ్రమాణముగాఁ గొని సంధివేలాదిగణమున 'శశ్వత్' శబ్ద పాఠ మొనర్చి 'సంధివేలాద్యృతు నక్షత్రేభ్యోఽణ్' అనుసూత్రమున నణంతముగాఁ బై వ్యాఖ్యాతలు శాశ్వత శబ్దమును సాధించినారు

ఇంత యేల ? మహాభాష్యకర్త పాణినిసూత్ర ప్రయోగములను బాణినిసూత్రములచేతనే సాధువు లని యెట్లు సాధించియున్నాఁడో గమనింపుఁడు

(యూ స్త్ర్యాఖ్యౌ నదీ)—అథ స్త్ర్యాఖ్యావితి కోఽయం శబ్దః స్త్రియమాచక్షాతే స్త్ర్యాఖ్యౌ యద్యేవం స్త్ర్యాఖ్యే యావితి ప్రాప్నోతి అనుపసర్గే హి కో విధీయతే అథవా పునరస్తు క ఏవ 'స్త్రియమాచక్షాతే స్త్ర్యాఖ్యావితి నను చోక్తం స్త్ర్యాఖ్యాయావితి ప్రాప్నోతి అనుపసర్గే హి కో విధీయతే ఇతి మూలవిభుజాదిత్వాత్కః భవిష్యతి (మహాభాష్యము ౧-౪-౨-3)

ఇట్టి వనేకములు ఇంకను బాణిని యనుశాసించిన భాష వేఱు సూత్రములు వ్రాసినభాష వేఱు అనువారుందురా ?

ఇదిగాక యీపట్టున 'అపాణినీయము' లని వీ రుదాహరించిన సూత్రప్రయోగము లన్నియుఁ బాణినీయ సాధ్యము లని శివదత్తాదులు సాధించినవియే మహాభాష్యమున 'నిత్యప్రహసితః', 'నిత్యప్రజల్పితః' అనువానిని బ్రదర్శించి నిత్యశబ్దమునకు బహులార్థకత్వము నిరూపింపఁబడినది పై శబ్దముల లోని నిత్యశబ్దము అనవరతము—అవిరతము అనునర్థమునఁ బ్రయోగింపఁబడినది కాదు ఎడతెగక—అనఁగా నొక్కక్షణమేని యాఁగక యెప్పుడును నవ్వువాఁడు లోకమున నుండుటయే యసంభవము కావున నీ ప్రయోగములలోని నిత్యశబ్దము బహులార్థకము—అనఁగా 'ఎక్కువగా నవ్వువాఁడు' అను నర్థమును బోధింపఁజాలినది ఇట్లే 'జమో ప్రహస్వా దచి

జము ణ్ణిత్యమ్' అను సూత్రములోని నిత్యగ్రహణము గూడ బహులార్థకము—అనఁగా, చాలవఱకీసూత్రము స్వలక్ష్యములయందుఁ బ్రవర్తింపవలసినదియే, కాని కొన్ని లక్ష్యములయం దీసూత్రము ప్రవర్తింపకపోయినను దోషము లే దని భావము పాణిని యాయాశయమును మనకు సూచించుటకే పై సూత్రములలో జముడాగమ మొనర్పక 'ఇకో యణచి' 'సనాద్యంతా ధాతవః' 'సుప్తిఙంతం పదమ్' అని ప్రయోగించెను 'శప్శ్యనోర్నిత్యమ్' అను సూత్రములోని నిత్యగ్రహణముగూడ నిట్టిదే యనుచుఁ దాను రచించిన పాతాళవిజయ కావ్యములో 'అపశ్యతీ వత్సమి వేందుబింబమ్ ఇత్యాదులఁ బ్రయోగించినాఁడు మహాభాష్యమునుబట్టి యీసూత్రములకు శివదత్తాదులే యిట్లు వ్యాఖ్యానించిరి 'సిద్ధే శబ్దార్థ సంబంధే' అను వార్తికవ్యాఖ్యానసందర్భమునఁ గల మహాభాష్యమును జక్కఁగాఁ జదువుకొనిన నీయర్థ మంతయుఁ దేటతెల్లముగాఁ బాఠకలోకమునకు విశదపడును ఇట్లీసూత్ర ప్రయోగములును పీ ఠపాణినీయము లనుట కంగీకరింప కున్నవి

చింతామణి విషయపరిశోధనమున నపాణినీయములని పేర్కొనఁబడిన పై పదునొకండు ప్రయోగములును 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'దను సిద్ధాంతసౌధమునకు మూలస్తంభములు ఇవి యన్నియు నీవ్యాసమున నా ప్రదర్శించినరీతిని పాణినీయములే యైనవి గనుక శ్రీశాస్త్రి గారి సిద్ధాంతసౌధము మూలస్తంభములు లేని సౌధమువలె నిరాధార మైనది

# పాణినీయము - కావ్యవాఙ్మయము

## అనుబంధపరామర్శము

పాణినీయము కావ్యభాషానుశాసకము కాదని 'చింతామణివిషయపరిశోధనము'లో వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు వ్రాసిన ద్వితీయ భాగమునకు ఖండన రూపము లగు నావ్యాసములు ('పాణినీయపరిశోధనము' అని ఇప్పుడు ప్రకటింపఁబడినవి) ౧౯౩౨ అక్టోబరు నవంబరు భారతి పత్త్రికలలోఁ బ్రకటింపఁబడినవి వానికి సమాధానముగా శ్రీశాస్త్రిగారొకయనుబంధము నిటీవలఁ దమ గ్రంథమునఁ బ్రకటించిరి నావ్యాసములలో గతార్థములు కాని విషయము లందు నాకుఁ గనిపించినవి కావు ఐనను బహుగ్రంథపరిశోధనమువలన నిటీవల నా కగపడిన కొన్ని క్రొత్త విషయములతోడను బహువారము సమగ్రమహాభాష్యపర్యాలోకనమువలన లభించిన పాణినీయ రహస్యములతోడను నావ్యాసవిషయములను విపులీకరించుట యావశ్యక మని తోఁచినది. కావునఁ బ్రకరణానుసారముగా వానిఁ గొన్నిటిని పొందుపఱచి 'మహాకవిప్రయోగ సాధనము' 'అనుబంధ పరామర్శ' మనుపేర వ్రాసితిని

### సర్వజన వ్యవహారభాష - వ్యాకరణసమ్మతి

శ్రీశాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు 'జనసామాన్య వ్యవహార భాష - బజారుభాష - వ్యాకరణసమ్మతమును గ్రాంథికమును నై యుండుట యేకాలమందును నేదేశమం

దును నశ్రుతచరము ఈ యభిప్రాయము నేనే గాక భాషా శాస్త్రజ్ఞు లెవ్వరును సమ్మతింపఁజాలరని నా నమ్మకము (అనుబంధము ౧ పా)

## భాషావిపరిణామము

ఇఁక నీవిషయమును గూర్చి విమర్శింతము భాష యనునది వ్యవహారార్థ మేర్పడునది యని భాషాశాస్త్రజ్ఞు లెల్లరు నంగీకరించిరి భాషాలక్షణప్రకారము భాష యనునది లోకవ్యవహారార్థమైనప్పుడు మునుముం దేభాషయైనను వ్యవహారముకొఱకు స్వస్వరూపముతోడనే - అనఁగా సాధుశబ్దములతోడనే - యేర్పడు ననక తప్పదు అపశబ్దకలుషిత మగువాఙ్మయమే లేనియానాఁడు సాధుశబ్దమయ మగుభాషయే సర్వజన వ్యవహారభాషగా - అనఁగా బజారుభాషగా - నున్నదనుట నిర్వివాదాంశము తరువాతఁ గొంతకాలమున కీభాషవక్తలయుచ్చారణ వైషమ్యము మొదలగు భాషావిపరిణామకారణములవలన వివిధ వికారములతో విపరిణామము చెందనారంభించును అట్టి సమయమున నపభ్రంశకలుషితముగాని సాధువాఙ్మయ మేదియో నిరూపించుటకు వ్యాకరణము లావశ్యకములగును ఇట్లేర్పడినవ్యాకరణము లితరవ్యవహారములయందువలె నాఁడు సాధుశబ్దములతో నిండియున్న సర్వజనవ్యవహారభాషను - బజారుభాషను - గూడ ననుశాసింపక మానవు భాషాశాస్త్రజ్ఞపథమున కిది విరుద్ధము గాదు సంస్కృతమునకు మునిత్రయమువా రేర్పఱచిన వ్యాకరణమిట్టిదియే సకలవాఙ్మయమును జక్కఁగాఁ బరిశోధించి యన

న్యసాధారణమగు లక్షణ మేర్పఱచిన పతంజలిభగవానుని కంటె నెక్కుఁడగుభాషాశాస్త్రజ్ఞుఁడీభాషకు మఱియొకఁడు లేఁడు ఇతఁడు పైని నానిరూపించిన విషయమున కంతకు నెట్లు ప్రత్యక్షసాక్ష్యము నిచ్చుచున్నాఁడో తిలకింపుఁడు మొట్ట మొదట సర్వజనవ్యవహారముకొఱకుఁ బరమేశ్వరసంకేతిత ముగా నేర్పడినది సంస్కృతభాష అది యశక్త్యోచ్చారణాది భాషావిపరిణామకారణములవలనఁ గ్రమక్రమముగా మాఱు చు వచ్చినది

(ఌకారోపదేశః) "అశక్తిజానుకరణార్థః అశక్త్యా కయాచిద్బ్రాహ్మణ్యా 'ఋతక' ఇతిప్రయోక్తవ్యే 'ఌతక ఇతి ప్రయుక్తమ్ తస్యానుకరణమ్ బ్రాహ్మణ్యౢతక ఇత్యాహ, కుమార్య్యౢతక ఇత్యాహేతి (మహాభాష్యము ౧-౧ ఋఌక్ సూత్రము ) ఇఁక భాష్యాభిప్రాయమును వ్యక్తీకరించుచు శబ్ద కౌస్తుభముగూడ నిట్లు చెప్పినది 'అనిదంప్రథమాశ్శబ్దాస్సా ధవః పరికీర్తితాః త ఏవశక్తివైకల్య ప్రమాదాలసతాదిభిః అన్యథోచ్చారితాః పుమ్భి రపశబ్దా ఇతీరితాః (శబ్దకౌస్తు భము ౪౨ పొ) సంస్కృతశబ్దముల కపభ్రంశములుగాఁ బ్రథమమునఁ బ్రాకృతాదు లేర్పడినవి "గౌరిత్యస్య శబ్దస్య-గావీ గోణీ గోతా, గోపోతలికేత్యేవమాదయో బహ వోఽపభ్రంశాః (మహాభాష్యము ౧ ౧. పస్పశాహ్ని కము ) సాధుశబ్దముల నిరూపించి యపభ్రంశములఁ బోఁద్రో యుటయే వ్యాకరణమునకుఁ గర్తవ్యము. "సమానే చార్థే శాస్త్రాన్వితోఽశాస్త్రాన్వితస్య నివర్తకో భవతి తద్యథా-దేవదత్తశబ్దః

దేవదిణ్ణశబ్దం నివర్తయతి' మహాభాష్యము. ౧ ౧ ఋలృక్ సూత్రము ) మహాభాష్యకర్త పై నుదాహరించిన యపభ్రంశరూపములు ప్రాకృతాదిభాషలలోఁ గల వని భాషాశాస్త్రజ్ఞులే యనుచున్నారు ఇఁక మహాభాష్యకర్త యుదాహరించిన సూతవైయాకరణసంవాదమును బరిశీలింపుఁడు

## సూతవైయాకరణ సంవాదము

చూ. పాణినీయ పరిశోధనములోని (సూతవైయాకరణ సంవాదము ) (మహాభాష్యము ౨ ౪ ౧ ౧౬ ఈ సందర్భమున శ్రీ శాస్త్రిగా రనుబంధములో ఇక్కడి సూతుఁడు సైతము శిష్టుఁడేకాని సామాన్యజనుఁడు కాఁడు" (అనుబంధము ౨ పా ) అనిరి సూతుఁడు శిష్టుఁడైన నేమి? "కోఽస్య రథస్య ప్రాజితా" (ఈబండి తోలువాఁ డెవఁడు) అని వైయాకరణుఁడు రథచోదకు లందఱఁగూర్చి మొట్టమొదట సంస్కృతముతో నుపక్రమించిన యుపక్రమణమే యాకాలమున సంస్కృతభాష సర్వజనవ్యవహారోపయోగి భాషగా నుండెడిదని స్పష్టీకరించినది తరువాత జరగిన సూతవైయాకరణసంవాద మపశబ్దకలుషిత మగువాఙ్మయ మానాఁడు సర్వజనోపయోగిభాష-బజారుభాష-లో సైత మాక్షేపాపాదకముగా నుండెడి దని స్థిరీకరించుచున్నది

ఇంకొకవిశేషము శిష్టుఁ డైనను సూతుఁ డిటఁ జేయునది రథచోదనాకృత్యము గాని వైదికకర్మోపయోగివ్యవహారము గాదు ఇట్టియెడ శ్రీ శాస్త్రిగారి సిద్ధాంతప్రకారము వైదికకర్మోపయోగి శిష్టవ్యవహారభాషామాత్రానుశాసకము

కాఁ దగిన పాణినీయము లోకవ్యవహారభాష - బజారుభాష- నె ట్లనుశాసింపఁగలిగినది ? అపశబ్దములు కావ్యములలో నయితము దుష్టములు గావని శ్రీశాస్త్రిగా రనునప్పుడు లోక వ్యవహారభాష—బజారుభాష—లోఁ గూడ నపశబ్ద ముప యోగింపఁ గూడ దని వైయాకరుణుని సూతుఁ డెట్లాక్షేపింపఁ గలిగెను ? వైయాకరణుఁ డైన నది గాదనక సమ్మతించి సమాధాన మెట్లొసఁగెను ? అనువాని కిట శ్రీ శాస్త్రిగారు ప్రత్యుత్తరింపవలసి యున్నారు ఇఁకఁ బ్రకృతమునకు వత్తము. ఇట్లు మహాభాష్యకర్త యీసూతవైయాకరణసంవాదము నుదాహరించి సంస్కృతము సర్వజనోపయోగిభాషగా నుండె డిదనియుఁ బాణినీయము దానిని నయిత మనుశాసించియున్న దనియు మన కెఱుకపఱచినాఁడు కావునఁ బైని నిరూపించిన రీతిని జనసామాన్యవ్యవహారభాష - బజారుభాష - వ్యాకరణ సమ్మత మగుట విరుద్ధము గాదు

## గ్రాంథిక భాషాస్వరూపము

ఇఁక నీభాష గ్రాంథిక మెట్లగునో పరిశీలింతము. భాష లన్నియు స్వస్వరూపములతో నలరారుచుండెడినాఁడు- అపశబ్దకలుషిత మగు వాఙ్మయమే లేనినాఁడు - గ్రాంథిక భాషయు జనసామాన్య వ్యవహారభాషయు నొక్కటిగా - అనఁగా నెట్టివైలక్షణ్యమును లేక - వెలసియుండుట విప్రతి పన్నము గాదు అటుతరువాత స్వస్వరూపముతో గ్రంథస్థ ముగా నిలిచి యాభాషయే గ్రాంథిక మనఁబడును. అదియే జనసామాన్యముచే వ్యవహరింపఁబడుచు నానాఁటికి వివిధము

లగు వికారముల నంది యపభ్రంశబహుల మై వ్యావహారిక భాషగాఁ బరిగణింపఁబడును కొన్నినాళ్ల కది స్వస్వరూపపరిజ్ఞానమే లేనివివిధపరిణామముల నాకరమై భాషాంతరముగాఁ గూడఁ బరిగణింపఁబడును ఇఁక గ్రాంధికభాష ప్రాథమికావస్థలో నపశబ్దకలుషితము గానిశుద్ధ మగుస్వస్వరూపముతో నేర్పడి వ్యాకరణాపేక్ష లేనిదియే యైనను జనసామాన్య వ్యవహారభాషతో లోకవ్యవహారము నడిపికొనువా రగుటచేఁ దరువాతివా రీభాష నుపయోగించునప్పుడు జనసామాన్యవ్యవహారభాషలోని యపభ్రంశములు గొన్ని దీనిలోఁగూడఁ బ్రమాదపతితములుగా సంభవించును ఇవియే కవిప్రమాదములని మన మనుచున్నాము అట్టి యపభ్రంశములను బోఁద్రోసి సాధుశబ్దములను నిరూపించుట కీభాషకును వ్యాకరణాపేక్ష కలుగును ఈయపభ్రంశములనుగూడ వ్యాకరణము సాధింపవలె నని శ్రీ శాస్త్రిగారు వాదులాడుచున్నారు కాని యపశబ్దములను సాధుశబ్దములను గా సాధించుట వ్యాకరణములపని కాదు సాధుశబ్దముల నిరూపించి యిట్టియపభ్రంశముల నిరాకరించుటయే వ్యాకరణమునకుఁ గర్తవ్యము

## సంస్కృతనామవివరణము

ఇఁక నీభాషకుఁ బురాతనముగా నేర్పడియున్న సంస్కృత మనునామమును బురస్కరించుకొని యిది ప్రాకృతాదుల నుండి సంస్కరింపఁగాఁ గలిగిన వాఙ్మయ మని కొందఱు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడిరి కాని పాణిని సంపూర్వక మగు 'కృఞ్' ధాతువున కలంకారాద్యర్థములయందు సుడా

గమము విధించినాఁడు "సూ 'సంపరిభ్యాం కరోతౌ భూషణే' సంస్కరోతి. అలఙ్కరోతీత్యర్థః" (సిద్ధాంతకౌముది) కావున దీనినిబట్టి నియమాదులచే బాగుగా నలంకరింపఁబడిన దగుటచేఁ బురాతనముగా నీభాష కీనామము సిద్ధించిన దనుటయే ప్రామాణికాభ్యుపగతము సహృదయసమ్మతము నయి యున్నది ఇఁక నప్రకృతము నావలకుఁ ద్రోయుదము ఇట్లు వస్తుస్థితిని బరిశోధించిన లోకవ్యవహారభాషయొకప్పుడు వ్యాకరణసమ్మతమును గ్రాంథికము నగుట గీర్వాణభాషాసంప్రదాయప్రకారము విరుద్ధము కాదు భాషాశాస్త్రజ్ఞు లన నేల ప్రామాణికమూర్ధన్యుఁడగు మహాభాష్యకర్తయే యీవాదము నంగీకరించి హస్తావలంబన మిచ్చినాఁడు ఇఁక జనసామాన్యభాష యొకకాలమున గ్రాంధికమును వ్యాకరణసమ్మతమును నగుట యశ్రుతచరమో శ్రుతచరమో ప్రాజ్ఞు లూహింతురు గాక.

---

## లౌకికవైదికవాఙ్మయము-భేదకారణములు

మానవసహజము లగునేకొలఁదిప్రమాదములో గలిగినప్పుడు భాష కది యొకవైలక్షణ్య మనుకొని యనంతములగు భాషావిభాగము లేర్పఱచుటయు వానికన్నిటికి నొక్కొక్క వ్యాకరణము గావలసియుండు ననుటయు నసమంజసములని యిదివఱకు నావ్యాసములో నిరూపించియున్నాను (చూ. పాణినీయపరిశోధనము, భాషావిభాగము) దానికి సమాధానముగా ననుబంధములో "శిష్టలోకభాషకును, వైదికభాష

కును వేర్వేఱుగ లక్షణరచనముచేసిన పాణినిమునియే యిందు లకు సమాధానము చెప్పకొనవలసియుండును ' (అనుబంధము ౯ పు) అని శ్రీ శాస్త్రిగారు ప్రత్యుత్తరించిరి ఈ సందర్భ మునఁ బాణినిముని నాకు సమాధానము చెప్పలేదు గాని పతంజలిముని ప్రత్యుత్తర మిచ్చినాఁడు ''సహిచ్ఛన్దాంసి క్రియన్తే నిత్యానిచ్ఛన్దాంసీతి (మహాభాష్యము ౪ ౩ ౧ ౧౦౧) శాస్త్రకర్తలు శ్రీ శాస్త్రిగారివలె నేపాశ్చాత్యాను సారముగానో మూల ప్రాకృతమునుండి సంస్కరింపఁబడి నది వైదికభాష యని వంశవృక్ష మొకదానిని నిర్మింపఁ దల పెట్టినవారు గారు వైదికవాఙ్మయ మపౌరుషేయ మని వారి యాశయము పై మహాభాష్యపంక్తు లట్టియాశయమునే విశ దీకరించినవి పురుషనిర్మితముగాక యనాదిగా నేర్పడియున్న యీవాఙ్మయమునఁ బ్రమాదము లున్న వనుటకు వారు సాహసించినవారు గారు అందుమూలమున నం దేది యున్నను నది యాదరించి తాము లక్షణ మేర్పఱచుకొనవలసినవారైరి ఇట్టి ప్రామాణ్య మైనను సంహితాభాగమునకే వా రొసఁగిరి. పదము జట మొదలగు వైదికభాగమును లౌకికవాఙ్మయము తోపాటు కృతకముగనే వారు భావించిరి ఇట్టి వైలక్షణ్య ముండుటనుబట్టియే శాస్త్రకర్తలు లౌకికవాఙ్మయమునకంటె వేఱుగా వైదికవాఙ్మయమునకు లక్షణ మేర్పఱపవలసినవా రైరి అట్టి వైలక్షణ్య మేదియుఁ గావ్యవాఙ్మయమునకు నితర వాఙ్మయమునకును గానరాదు భారతాదిభాషను గ్రాంథిక భాష యని శాస్త్రిగారు వ్యవహరించిరి ఇఁకఁ బరిశిష్టన్యాయ మునఁ గావ్యభాష గ్రామ్యభాష యగుచున్నది అది గ్రాంథిక

మగుటకును నిది గ్రామ్య మగుటకును దగుకారణము లేవియు నా కగపడలేదు శ్రీ శాస్త్రిగారే యాకారణముల నిరూపింప వలసియున్నారు

---

## పాణినీయము నాఁటి కావ్యవాఙ్మయము

"పాణినీయమునకు ముందటి వనఁదగు కావ్యము లున్న ట్లీవఱ కెవ్వరును నుదాహరించి యుండలేదు' అని శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు తమ చింతామణి విష యపరిశోధనము అనుబంధము (పుట ౪)లో వ్రాసినారు దీని యాథార్థ్య మెట్టిదియో విమర్శించిచూతము

## పాణినికిఁ బూర్వమే కావ్యములు గలవు

పాణినికాలమునకుఁ బూర్వమే స్మృత్యాదులలో "కావ్యాలాపాంశ్చ వర్జయే' త్తనురీతి నిషేధములు కాన వచ్చుచున్నవి కావ్యవాఙ్మయమే యానాఁ డసంభవమైనప్పు డట్టి వాఙ్మయము పరనార్థము కా దను నిషేధ మెట్లు బయలువెడలినది ? ఇట్టి నిషేధములు బయలువెడల వలయు నన్న నెంతగాఁ గావ్యవాఙ్మయ మానాఁడు ప్రబలియుండ వలయునో, యెంద ఱాకావ్యపారమున నిమగ్నులై వేదాధ్య యనము నేమఱియుండవలయునో లోక మూహింపలేకపోదు వేషధారులగు నటులతో సహభోజనాదులను నిషేధించుచు దృశ్యకావ్యములు సయిత మానాఁడు కలవని యాస్మృత్యా దు లనుచున్నవి పురాణాదిప్రాచీన వాఙ్మయములోఁ గావ్య ములకేగాక దృశ్యకావ్యములకు సయితము విరివిగా లక్ష

ణము చెప్పఁబడినది (చూ॰ అగ్నిపురాణము) అందు 3౬౬-వ అధ్యాయములో "కావ్యస్య నాటకాదేశ్చాప్యలం కారాన్ వదామ్యథ అని ప్రారంభించి గద్యము పద్యము మిశ్రము అని మూఁడువిధములుగాఁ గావ్యములను విభజించి గద్యాదులకుఁ గల చూర్ణికాద్యవాంతరభేదములును వానికిఁ గల లక్షణములును స్పష్టముగా నుడివి కావ్యనిర్మాణవిధ మిట్టిదని విశదీకరించుచు 'అతఏవ మహాకావ్యం తత్కర్తాచ మహాకవిః వాగ్వైదగ్ధ్య ప్రధానేఽపి రస ఏవాత్ర జీవితమ్ అని చెప్పి యీ యధ్యాయము పరిసమాప్త మొనర్పఁబడి నది 33౭-వ అధ్యాయమున రూపకములు ఉపరూపకములు నాందీ స్వరూపము కథోద్ఘాతాదులు పంచసంధ్యాదులును నిరూపింపఁబడినవి ఈపురాణమున నివి ప్రక్షిప్తము లని నేఁటివా రందురు కాని యవి యట్టివి కావని నిరూపింపఁగల ప్రమాణము లనేకము లున్నవి

## ఆదికావ్యము

ఇదిగాక యాదికావ్యముగా నీవాఙ్మయమున రామా యణ మేనాఁడో వెలువడియున్నది "ఇత్యార్షే శ్రీమద్రా మాయణే ఆదికావ్యే బాలకాండే శ్రీమద్రామాయణకథా సంక్షేపో నామ ప్రథమస్సర్గః' అనురీతిని స్పష్టముగా నీకావ్య గద్యములం దంతటను నిది కావ్యమని పేర్కొనఁబడియున్నది ఇది మహాకావ్యలక్షణములతో సమగ్రముగా నిండియుండిన మహాకావ్యము తరువాతి లక్షణకర్తలైనను దీనినిబట్టియే తమ కావ్యలక్షణములను బరిష్కరించుకొనిరి ఐనను శ్రీ శాస్త్రిగారి కేలయో యిది మహాకావ్య మనిపించినది కాదు

సర్వలక్షణసమగ్రమగు నిట్టి మహాకావ్య మేనాఁడో జగత్ప్రసిద్ధి కెక్కి సర్వజనానురంజకమై యాదరింపఁబడుచుండఁగాఁ గనులారఁ గాంచుచున్న కవిబ్రహ్మలు కావ్యసృష్టికిఁ గల మాడనీయక పాశ్చాత్యానుసారముగా శాస్త్రిగారు నిర్ణయించిన (బహుశః క్రీ శ ౬) కావ్యకాలమువఱకును నిరీక్షించుచుండి రనుట యుక్తియుక్తమైనను గాదు అన్నిటికిని శ్రీ శాస్త్రిగారి ఛందము ననువర్తించియే వారి వాదము సరి గాదని ప్రమాణపురస్సరముగా నిరూపించుచున్న నేనైనను రామాయణము మహాకావ్యము కా దనుకొనియే పాణినీయమునాఁటి కావ్యవాఙ్మయ మేదియో నిరూపించెదను కావ్యపరిభాషలును నాటకపరిభాషలును విపులముగాఁ బాణినికిఁ బూర్వమే స్మృతిపురాణాదులలోఁ బ్రసిద్ధికెక్కి యున్నవని నాఁటి వాఙ్మయమే చాటిచెప్పుచున్నది. ఇట్టి పరిభాషలు లక్ష్యవాఙ్మయము లేక యేనాఁడును జగద్విదితములు కానేరవని విమర్శకులగువారికి వేఱుగాఁ జెప్పవలసిన యంశము కాదు పై నిదర్శనములఁబట్టి పాణినీయమునకంటెఁ జాలఁ బ్రాచీనముగానే కావ్యవాఙ్మయము ప్రసిద్ధమై యున్న దని మన మనుకొనవచ్చును

ఇఁకఁ బాణినీయమునకు మూలపురుషులగు మునిత్రయమువారిని గ్రమక్రమముగా నుదాహరించుచు వారు సాధించిన కావ్యప్రయోగములు పేర్కొనిన కావ్యములు, నిపతించిన శబ్దములు మున్నగు నిదర్శనములఁబట్టి వారి నాఁటికిఁ గల కావ్యవాఙ్మయ మెట్టిదియో దానినినయితమొకింత పరికింతము

## పాణిని

ఇతఁ డీవ్యాకరణమును మొట్టమొదట సూత్రరూపముగాను, గణరూపముగాను ననుశాసించినవాఁడు ఈతని నాఁటి వాఙ్మయమును బరిశీలింపవలయునన్న నితఁడు రచించిన సూత్రములు, నిర్దేశించిన గణములే మన కిప్పుడు ముఖ్యముగా నాధారము లగునవి వాని నాధారముగాఁ జేసికొని యే యీ క్రింద నతని కాలమునకు శ్రవ్యకావ్యములే గాక దృశ్యకావ్యములు సయిత మెట్లు విస్తరిల్లినవియో తిలకింతము

పాణిని సూత్రించిన 'పారాశర్య శిలాలిభ్యాం భిక్షు నటసూత్రయోః' 'కర్మందకృశాశ్వా దినిః' అను సూత్రముల వలన 'శైలాలినః'—శిలాలిప్రోక్త మగు నాట్యగ్రంథమును జదువువారు 'కృశాశ్వినః'—కృశాశ్వప్రోక్తమగు నాట్యగ్రంథము నధ్యయనించువారు అను రూపములు సిద్ధించుచున్నవి పై సూత్రములనుబట్టి 'కృశాశ్వుఁడు', 'శిలాలుఁడు' అనువారు నాట్యగ్రంథములను రచించి రనియు, నటు లవి చదువుకొనువా రనియు స్పష్ట మగుచున్నది 'ఛందోగౌక్థిక యాజ్ఞిక బహ్వృచనటాఞ్ఞ్యః' అను సూత్రముచే "నటానా మామ్నాయః—నాట్యమ్ నటానాం ధర్మః నాట్యమ్" అనురీతి నర్థద్వయమందును బ్రత్యేకముగా నటశబ్దమును నిర్దేశించి నాట్యశబ్దమును సాధించెను మఱియొకచో 'కర్మ వేషా ద్యత్' అను సూత్రముచే 'వేషేణ సంపాదీ=వేషముచే ధనము నార్జించువాఁడు' అను నర్థమున నటపర్యాయముగా వేష్యశబ్దమును సాధించెను దీనినిబట్టి నటు లానాఁడు వేషధారులై నాటకము లాడుచు ధనము నార్జించుట సయితము

సుప్రసిద్ధ మనియు నాట్యలక్షణ గ్రంథము లానాఁటికే యనేకములు సుప్రసిద్ధములై యున్న వనియు మన మూహించుట కవకాశ మేర్పడుచున్నది. ఇదిగాక "నటస్య స్త్రీ = నటుని భార్య" యను నర్థమున 'పుంయోగా దాఖ్యాయామ్' అను సూత్రముచే 'నటీ' అను జీవంతరూపము సిద్ధించినను, నాట్య పరిభాష కిది తగినది కాదని గౌరాదిగణములో-'నట' శబ్దమునకుఁ గంఠోక్తముగాఁ బ్రత్యేకపాఠ మొనర్చి 'నటీ' శబ్దమును నిష్పన్న మొనర్చినాఁడు చూచితిరా పాణినీయము కావ్య వాఙ్మయమున నెంత జాగరూకత వహించినదియో ఇది యొక్కటియే కాదు శైలూషాదిశబ్దములకు నయితము ప్రత్యేకముగా గణపాఠ మొనర్చి యితఁడు సాధించిన నాట్య పరిభాష లిట్టివి యనేకములు ఇంకొక విశేషము గౌరాది గణమున 'నాట'* శబ్ద మొకఁడు పాణినిచేఁ బఠింపఁబడినది ఈగణపాఠమున నీ నాటశబ్దమునకు జీప్ప్రత్యయము రాఁగా 'నాటీ' యని యగును ఈ నాటీశబ్దముచే నాటిక', 'ప్రకరణిక' అను రెండు దృశ్యకావ్యములును వ్యవహరింపఁబడుచున్నవి ఈ నాటీశబ్దమును వ్యాఖ్యానించుచు గణరత్నమహోదధికారుఁ డిట్లు వ్రాసియున్నాఁడు· "నాటీ-నాటీ సంజ్ఞయా ద్వే కావ్యే ఏకో భేదః ప్రఖ్యాతో నాటికాఖ్యః ఇతర స్త్వప్రఖ్యాతః ప్రకరణికా సంజ్ఞకః' దీనికిఁ బ్రమాణము నైత మీతఁ డి ట్లుదాహరించుచున్నాఁడు

---

* కౌముదిలో నిది నోట' శబ్దముగా మన కిపు డగపడును. ఈ పాఠము ప్రామాదికము (చూః కాశికా గణరత్నమహోదధులు)

అనయోశ్చ బంధయోగా
దేకో భేదః ప్రయోక్తృభిర్జ్ఞేయః,
ప్రఖ్యాత స్త్వితరో వా
నాటీసంజ్ఞాశ్రితే కావ్యే "

(గణరత్నమహోదధి, నామగణాధ్యాయము. ౭౭)

ఈ నిదర్శనమునుబట్టి కావ్యములేగాక, దృశ్యకావ్యములు సయితము పాణినినాఁటికేగాక పాణినికిఁ బూర్వకాలమందును గలవనుట కభ్యంతర మేమైనఁ గలదా? పాణిని నాఁటికిఁ గావ్యములు కలవని నిరూపించుట కీనిదర్శన మొక్కటియే చాలినను గొన్నివిశేషములు పాఠకలోకమున కెఱుక పఱచుకొనఁ దలఁచి మఱికొన్నివిషయములఁగూడ నిటఁ బ్రదర్శించెదను

'శిశుక్రంద యమసభ ద్వంద్వేంద్రజన నాదిభ్య శ్ఛః', 'అధికృత్య కృతే గ్రంథే'—ఇంద్రజననమును గూర్చి వ్రాయఁబడిన గ్రంథము అను నర్థమునఁ బై సూత్రముచే ఛప్రత్యయమును విధించి 'శిశుక్రందీయము', 'యమసభీయము', 'ఇంద్రజననీయము' 'ప్రద్యుమ్నగమనీయము', 'సీతాన్వేషణీయము అనురీతిని నాఁటి కావ్యనామముల ననేకములఁ బాణిని సాధించినాఁడు. 'ఇంద్రజనన' 'ప్రద్యుమ్నగమన' 'సీతాన్వేష' ణాదులింద్రజననాదిగణమునఁ బాణినిచేఁ బఠింపఁబడినవి 'శిశుక్రంద, యమసభ' శబ్దములు సూత్రముననే గలవు ప్రాచీనముగా నేర్పడిన యీ కావ్యనామములఁ జూచియే భారవి తన కావ్యమునకు 'కిరాతార్జునీయ'మను పే రిడెను. ఇప్పటికై

నను బాణినికాలమునకుఁ గావ్యవాఙ్మయము శ్రుతచర మని శ్రీ శాస్త్రిగా రంగీకరింపరా? ఇఁక నది యిది యననేల?

## జాంబవతీ పరిణయము

పాణినిమహర్షి రచించిన మహాకావ్యమునే యుదాహరింతును 'జాంబవతీపరిణయ'మనునది దీనికి నామము పాతాళ విజయ మనునది దీనికి నామాంతరము ఇందలి పద్యములు కడు హృద్యములు ఇట్టి సరసకావ్యరచన యేర్పడవలయునన్న నాఁటి కెంత కావ్యవాఙ్మయము ప్రబలియుండవలయునో బుద్ధిమంతు లగువా రూహింపఁగలరు మచ్చున కీకావ్యము నుండి రెండు పద్యములుమాత్ర మిట నుదాహరించెదను

"అ స్తి ప్రచీచ్యాం దిశి సాగరస్య
వేలోర్మిగూఢే హిమశై లకుక్షౌ,
పురాతనీ విశ్రుతపుణ్యశబ్దా
మహాపురీ ద్వారవతీచ నామ్నా" (౨౯)

'త్వయా సహార్జితం యచ్చ
యచ్చ సఖ్యం పురాతనమ్,
చిరాయ చేతసి పున
స్తరుణీకృత మద్య మే (౧౬౯)

జాంబవతీపరిణయము పాణినికర్తృకము

ఈ కావ్యము శాస్త్రకర్తయగు పాణిని రచించినదని లక్షణకర్త లెందఱో యుదాహరించినవారు రాజశేఖరుఁడు తన సూక్తిముక్తావళియందును హారావళియందునుగూడ స్పష్టముగా నిట్లు చెప్పియున్నాఁడు

"స్వస్తి పాణినయే తస్మై
యస్య రుద్రప్రసాదతః
ఆదౌ వ్యాకరణం కావ్య
మను జాంబవతీజయమ్'

ఈ కావ్యము తత్కర్తృకము కాదను కొందఱ వాద మపరిశోధనమూలకము ఇతర మహాకావ్యకర్తలతోపాటు పాణినియు మహాకావ్యకర్త యని సదుక్తికర్ణామృతమునఁ జేర్కొనఁబడినవాఁడు

'సుబంధౌ భక్తిర్నః క ఇహ రఘుకారే న రమతే
ధృతర్దాక్షీపుత్రే హరతి హరిచంద్రోఽపి హృదయమ్ .."

దాక్షీపుత్త్రుఁ డనునది పాణినికే నామాంతరము (చూ త్రికాండి—'దాక్షీపుత్త్రస్య పాణినేః' అని ఘుసంజ్ఞా సూత్రమహాభాష్యము)

పై శ్లోకమునఁ - బేర్కొనఁబడినవా రందఱును మహా కావ్యకర్తలగు కవులు ఇఁకఁ బాణినిమాత్రము మహాకావ్య కర్త కాఁడనఁగలమా ?

ఈరీతిని బరిశోధించినఁ బాణినికాలమున కననేల, అంతకుఁ బూర్వమే యెన్ని శతాబ్దములనుండియో శ్రవ్య కావ్య ప్రచారమే గాక దృశ్యకావ్యప్రచారము సయిత మప్రతిహతముగా నున్నదని యితరనిదర్శనము లటుండ పాణి నివాక్యములఁబట్టియే మనకుఁ దెలియవచ్చుచున్నది.

ఇఁక వార్త్తికకారుని వర్తన మెట్టిదియో తిలకింతము

## వరరుచి

### ఆఖ్యానాఖ్యాయికలు

ఇతఁడు 'ఆఖ్యానాత్కృత స్తదాచష్టే కృల్లుక్ ప్రకృతివచ్చ కారకమ్' 'ఆఖ్యానాఖ్యాయికేతిహాస పురాణేభ్యశ్చ', 'లుబాఖ్యాయికాభ్యో బహుళమ్' అను వార్త్తికములను విరచించి తన కాలమునకుఁ బూర్వమే కావ్యములు ప్రసిద్ధి చెందిన వనినాఁడు ఆఖ్యానాఖ్యాయికలు కావ్యవిశేషములని లక్షణకర్త లిట్లుదాహరించినారు

"అపాదః పదసంతానో
గద్య మాఖ్యాయికా కథా,
ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ.
తత్కథాఖ్యాయికే త్యేకా
జాతి స్సంజ్ఞాద్వయాంకితా,
అత్రై వాంతర్భవిష్యంతి
శేషా శ్చాఖ్యానజాతయః'
(కావ్యాదర్శము, ౧ ౨౩-౨౮)

### వారరుచ మహాకావ్యము

ఇదిగాక యీతఁడు 'వారరుచ' మను మహాకావ్యమునుగూడ వ్రాసినాఁడు మహాభాష్యకర్త స్పష్టముగాఁ దన మహాభాష్యమున నీమహాకావ్యమును బేర్కొనినాఁడు 'పీటర్సన్' ప్రభృతులగు పాశ్చాత్యవిమర్శకులుసైత మీకావ్య

మీతనిదిగానే యుదాహరించి కొనియాడినారు ఈ కావ్య మునుండి సుభాషితరత్నభాండాగారమున ౧౭ పద్యము లుదాహరింపఁబడినవి అశ్వఘోషాదులుసైతము తమ లక్షణ గ్రంథములలో దీని నుదాహరించినారు ఈ మహాకావ్య సారస్య మొకింత తేటపడుటకు మచ్చునకు రెండు పద్యము లీ పట్టున ముచ్చటింపక తప్పదు

'అపి స దివసః కిం స్యా ద్యత్ర ప్రియాముఖపంకజే
మధు మధుకరీవాఽస్మద్దృష్టి ర్వికాసిని పాస్యతి,
తదను చ మృదుస్నిగ్ధాలాపక్రమాహిత వర్ణనః
సురతపచివై రంగై స్సంగో మమాఽపి భవిష్యతి"
"అస్యా మనోహరాకార కబరీభారతర్జి తాః
లజ్జయేవ వనే వాసం చక్రు శ్చమరబర్హిణః

వరరుచి కావ్యకర్త

ఈ వరరుచి మహాకావ్యకర్త యని సూక్తిముక్తావళి లోఁగూడ నీ క్రిందిరీతిని స్తుతింపఁబడినాఁడు

భాసో రామిలసౌమిలౌ వరరుచిః
శ్రీసాహసాంకః కవి
ర్మేఘో భారవికాళిదాసతరళాః
స్కంద స్సుబంధు శ్చ యః
దండీ బాణదివాకరౌ గణపతిః
కాంతశ్చ రత్నాకర
స్సిద్ధా యస్య సరస్వతీ భగవతీ
కే తస్య సర్వేఽపి తే"

ఇఁక నీ విషయమున మహాభాష్యకర్త పాటించిన పరిపాటి యెట్టిదియో గమనింతము

## పతంజలి

ఇతఁడు వ్రాసిన మహాకావ్యము లేవియో మన కిప్పుడు తెలియరాకున్నవి కాని 'ఆఖ్యానాఖ్యాయికేతిహాసపురాణేభ్యశ్చ' అను వార్తికోదాహరణసందర్భమున నితఁడు "ఆఖ్యాన—యావక్రీతికః ప్రైయంగవికః, యాయాతికః ఆఖ్యాయికా—వాసవదత్తికః సౌమనోత్తరికః (మహాభాష్యము ౪-౨-౧-౬౦) అని కొన్ని యాఖ్యానాఖ్యాయికలఁ బేర్కొనినాఁడు మరల 'అధికృత్య కృతే గ్రంథే' అను సూత్రవ్యాఖ్యాన సందర్భమునఁగూడ "వాసవదత్తా, సుమనోత్తరా" (మహాభాష్యము ౪-3-౧-౮౭)అని యుదాహరించినాఁడు ఇవిగాక 'కంసవధము' 'బలిబంధము' అనువానినిగూడ నీతఁడు పేర్కొనినాఁడు ఇఁక 'వారరుచ' మను మహాకావ్యమును గంఠోక్తముగా నుడివినవాఁ డితఁడే-వారరుచం కావ్యమ్ (మహాభాష్యము ౪-3-౧-౧౦౧) ఈ కావ్యమునుగూర్చి మఱియొకచో ముచ్చటింతును ఇవిగాక కొందఱు కవుల మహాకావ్యములనుండి కొన్ని పాదములుసైత మనువదించి వానిని బాణినీయమునకు లక్ష్యములుగాఁ బ్రదర్శించినాఁడు ఆ కావ్యములు కొన్ని మన కిప్పుడు దొరకుచునే యున్నవి ఈతఁ డొనర్చిన మఱికొన్ని ప్రసంగములఁబట్టియు, మఱికొన్ని

నిదర్శనములఁ బట్టియు దృశ్యకావ్యప్రచారమునయిత మీతని కాలమునకు సుప్రసిద్ధముగా నున్నదని యింకను విశదముగా మనము నిర్ణయింపవచ్చును

వస్తుస్థితి యిట్లుండఁ బాణినీయమునాఁటికిఁ గావ్యములే లేవని పరిశోధకు లనుట పరిహాస్పదముకాదా ?

---

## కవులు - ప్రమాదములు

### ప్రమాదములు తప్పనివి

ప్రమాదము మహాకావ్యకర్తలగు మహాకవులకే యన నేల, శిష్టశిరోమణులగు మహాత్ములకుఁగూడఁ దప్పినదికాదు. పరశురామాదులవంటి మహానుభావులే యాచారవిషయమునఁ బ్రమాదపడి రని ధర్మశాస్త్రకర్తలు నుడివిరి ప్రమాదమునకు లోనైన యట్టి యాచారములు మనకుఁ బ్రమాణములు కావనికూడ వారే వ్రాసిరి పతంజలిభగవానుఁ డిట్టి వాదము నంగీకరించి బుద్ధోక్తుల నిరాకరించెను.

'ప్రమత్తగీత ఏష తత్రభవతః, యస్త్వప్రమత్తగీత స్తత్ప్రమాణమ్" (మహాభాష్యము పస్పశాహ్నికము)

ఇంతయేల పాణినీయమువంటి మహాశాస్త్రమునకు మూలపురుషుఁడగు పాణినిమహర్షి నే మహాభాష్యకర్త యొక సందర్భమున "ప్రమాదకృత మాచార్యస్య' (మహాభాష్యము, ౮-౨-౧-౭౦) అనినాఁడు ఇందు దోష మేమి కలదు? ప్రయత్నపడి వ్యాకరణమును సమగ్రముగాఁ జదివియుఁ దన నుశిష్టములగు సాధుశబ్దములఁ బ్రయోగింపఁజాలక వ్యాకరణ

మునే యెఱుఁగనివారివలె నపశబ్దములనే విరివిగాఁ బ్రయో గించు వైయాకరణుల నెందఱినో ప్రత్యక్షముగా మనము చూచుచున్నాము ఈ విషయమున మహాభాష్యకర్తయు నిట్లు చెప్పినాఁడు "కృతప్రయత్నా* శ్చాప్రవీణాః†" (మహా భాష్యము, పస్పశాహ్నికము)

ఇట్టిచోఁ గవులకుఁ బ్రమాదము లుండవనుట యుక్తి యుక్తము కాదు

## ప్రమాదములు ప్రమాణములు కావు

ధారాశుద్ధితోఁ జక్కని కవిత్వము వ్రాయఁగల కవు లెందఱు మన కిప్పు డగపడుట లేదు? వారి కావ్యములలోఁ బ్రత్యక్షముగాఁ జిత్రవిచిత్రములగు నపశబ్దప్రయోగము లెన్ని మనము చూచుటలేదు? ఇవి కొంతకాలమునకుఁ బ్రాచీన ములై మహాకావ్యము లనఁబడకపోవు. ఐనను నందలి తప్పు లొప్పులని యేనాఁడును బరిగ్రహింపఁబడవు. ఇఁక నిం దుండు రసభావగర్భితము లగు వర్ణనములు, చమత్కార జనకము లగు కథాసంవిధానములు, నర్థవంతములగు సాధుశబ్దప్రయో గములు నేనాఁడును నాదరణీయములు కాకపోవు తెనుఁగున శైవకవులు వ్రాసిన గ్రంథము లీపట్టున మనకు నిదర్శనములు గానోపును ఈ కావ్యములలో నుపయోగింపఁబడిన యప భ్రంశశబ్దములు పెక్కులు. శ్రీనాథాదులకుఁ బూర్వమే యీ కావ్యములు సుప్రసిద్ధములై యున్నవి. ఐనను శ్రీనాథాది

* ప్రయత్నాధీతవ్యాకరణాః
శబ్దప్రయోగా దాపటకలాః (ఉద్యోతము)

మహాకవులు వీరి కావ్యములనుండి సరసములగు కథాసంవిధానములు, హృద్యములగు వర్ణనములు మున్నగువానిని ( వార విలాసాదులలో (గ్రహించిరేగాని విరివిగా వీరు (ప్రయోగించిన "మహియ్యాఁక, అభిధియ్యతే, మహాదేవి తదియ్యము; యవ్వనము' మున్నగు నపభ్రంశముల (గ్రహించి (ప్రయోగింప సాహసింపలేదు మహాకవులు (ప్రయోగించినంతమాత్రమున నపశబ్దములు సుశబ్దములు కావు కావుననే యాంధ్రమహాకవి యగు ధూర్జటి తన 'కాళహస్తి మాహాత్మ్యము'నఁ బరమేశ్వరవిరచితమగు పద్యమునందును దప్పులు గలవని నక్కీరునిచే నీశ్వరునితో వాదము చేయించి గెలిపించినాఁడు. కావ్యరచనాసంప్రదాయములనే యెఱుఁగనివారు కవులుగను నన్యదేశభాషాసంపర్కమున భాషాస్వరూపమునే తాఱుమాఱొనరింపఁగడఁగువారు భాషాపరిశోధకులుగను, (బధానతమమగు సంస్కృతభాషాపరిజ్ఞానమైన నలవడనివారు లక్షణకర్తలుగను, ఉభయభాషాపాండిత్యము మాట యటుండ వర్ణక్రమపరిజ్ఞానమునకైన నోఁచుకొననివారు నిఘంటుకర్తలుగను సంభవించుచుండుటచే నేనాఁటికైన నీదేశభాషల కిట్టి యపభ్రంశములు (ప్రమాణము లగునవస్థ పట్టునేమో కాని సంస్కృతమునకు మాత్ర మిట్టియవస్థ యేనాఁడును బట్టదు

## సంస్కృతభాషా వైలక్షణ్యము

లక్షణజ్ఞానమువలననే సకలలక్ష్యపరిజ్ఞాన మలవఱచుకొనఁదగు పాణినీయమువంటి విపుల మగు వ్యాకరణ మీ భాషకుఁ (బ్రాచీనకాలముననే యేర్పడియున్నది. ఒకరికి

ముగ్గురు మహర్షులు శబ్దప్రపంచమునంతను జక్కఁగా శోధించి సాధించియుండుటచే దీనిచే సాధింపఁబడని సాధుశబ్దమే మిగిలినది కాదు తరువాతికవు లైనను గావ్యభాషకుఁ బ్రధానతమ మగు వ్యాకరణము పాణినీయ మనియే తలఁచి దానిని జిహ్వాగ్రమున నుంచుకొనియే తమ కావ్యముల రచించుచు వచ్చిరి. వారి తరువాతికవు లైనను ఛందోనియమాదులచే నీ రెక్కడనేని ప్రమాదపడినప్పుడు పాణినీయమునుబట్టి కవిప్రమాదములుగా వానిని భావించి యాదరింపక త్రోసిపుచ్చిరేకాని ప్రాచీన మహాకవిప్రయోగములుగదా యని ప్రమాణీకరించుకొని తమ కావ్యములలో వానిని దాము ప్రయోగింపలేదు. కావుననే యితర వాఙ్మయములకంటె సంస్కృత వాఙ్మయ మెన్నిరెట్లో పెరిఁగినను పాణినీయమునకు దాఁటిపోఁగల యపభ్రంశము లేకొలఁదిగానో సంభవించుటయే తటస్థించినది. దీనికి మూలకారణము సంస్కృతమున మహాకవులందఱును వాఙ్మయమున కెల్లఁ బ్రధానతమమగు వ్యాకరణము పాణినీయ మని తలఁచి దానియందుఁ బారంగతులు కానిదే మహాకావ్యరచనకుఁ గడఁగకపోవుటయే

> కపయ స్తదవేక్షణే తరూ
> న్వ్యథయామాసు రసాధుభిః పదైః
> పదశాస్త్ర ఇ వానధీతినః
> కవయః కర్ణపథాన్విపశ్చితామ్ "

అని యొక మహాకవి వచించినట్లు వ్యాకరణమును జదువక కావ్యకర్త లైనవా రెవరైనఁ గలరేమో కాని

సంస్కృతమున వారి వాఙ్మయ మంతగాఁ బ్రబలి ప్రమాణ పదము నధిష్ఠింపలేదు

### కవులే తమకుఁ బ్రమాదములు కల వనుచున్నారు

ఇఁకఁ బ్రకృత మనుసరింతము మహాకవుల కావ్యము లలో గుణదోషవిచారణము సలుపుచుఁ దప్పులనియు నొప్పు లనియు వాదులాడుచున్నవారము మనమేగదా కవు లేసంద ర్భమున నెట్లు వర్ణించినను నదియెల్ల నౌచితీయుక్తమే యని మనము పరిగ్రహించుట లేదు. భవభూతివంటి మహాకవి యౌచిత్యమునకుఁ దగఁడని కొన్నిపట్టులలో నిరాకరించుచు న్నాము కాళిదాసుఁ డౌచిత్యమునకుఁ దగినవాఁ డని యొక కావ్యములో నొక సందర్భమున మనము కొనియాడుచు న్నాము మరల నాకవినే యా గ్రంథముననే మఱియొక సంద ర్భమున నౌచితిని బోవిడిచె నని మనము విమర్శించుచు న్నాము. ఇట్టి యర్థదోషములు కవులకుఁ గలవని మన మొప్పు కొనుచున్నప్పు డర్థముతో నవినాభావసంబంధము గల శబ్ద ప్రయోగముననుమాత్రము వారు పొరపడి రని మనమేల యనఁ గూడదు? కావుననే సాహిత్యచక్రవర్తులగు క్షేమేంద్రాదుల వంటి మహాకావ్యలక్షణకర్తలు కాళిదాసాది కవిసార్వభౌ ముల కావ్యములలో నర్థదోషములును, శబ్దదోషములును నెక్కులు గలవని తమ లక్షణ గ్రంథములలో ని ట్లుదాహ రించిరి :

నతు యథా కాళిదాసస్య—

వర్ణప్రకర్షేసతి కర్ణికారం
దునోతి నిర్గంధతయా స్మ చేతః,
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం
పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః

అత్ర కేవలకర్ణికారకుసుమవర్ణనమాత్రేణ విధాతృవాచ్యతాగర్భేణైవ ప్రస్తుతశృంగారానుపయోగినా తదుద్దీపనవిభావౌచితం న కించి దభిహితమ్" (ఔచిత్య విచార చర్చ ౮ పుట)

"నతు యథా భవభూతేః—

వృద్ధాస్తే న విచారణీయచరితా
స్తిష్ఠంతు హుం వర్తతాం
సుందస్త్రీదమనేఽప్యఖండయశసో
లోకే మహాంతోహి తే,
యాని త్రీణి కుతో ముఖాన్యపి పదా
న్యాసన్ ఖరాయోధనే,
యద్వా కౌశల మింద్రసూనుదమనే
తత్రాప్యభిజ్ఞో జనః

అత్రాప్రధానస్య రామసూనోః కుమారలవస్య పరప్రతాపోత్కర్షాసహిష్ణో ర్వీరరసోద్దీపనాయ సకల ప్రబంధ జీవిత సర్వస్వభూతస్య ప్రధాననాయకగతస్య వీరరసస్య తాటకాదమన ఖర రణాపసరణాన్యరణసంసక్తవాలి వ్యాపాదనాది

జనవిహితాపవాద ప్రతిపాదనేన స్వవచసా కవినా వినాశ కృత ఇత్యనుచితమేతత్ ' (ఔచిత్యవిచారచర్చ, ౧౦ పుట)

"గాండీవీ కనకశిలానిభం భుజాభ్యా
మాజఘ్నే విషమవిలోచనస్య వక్షః (భారవిః)

'ఆజోయమహనః' 'స్వాంగకర్మకా' చ్చేత్యనుశాసన బలా దాఙ్పూర్వస్య హనః స్వాంగకర్మకస్యై వాత్మనేపదం నియమితమ్ ఇహాతు తల్లంఘిత మితి వ్యాకరణ లక్షణ హీనత్వా చ్చ్యుతసం స్కారత్వమ్ ' (సాహిత్య దర్పణము ౩౭౫ పుట)

"సూ. మార్గే రాత్మనేపద మలక్ష్మ—చురాదా 'మార్గ అన్వేషణే' ఇతి పఠ్యతే 'ఆధృషాద్వా' ఇతి వికల్పిత ణిచ్కః తస్మా ద్యదాత్మనేపదం దృశ్యతే 'మార్గంతాం దేహభార' మితి తత్ అలక్ష్మ అలక్షణమ్ పరస్మై పదిత్వా న్మార్గేః తథాచ శిష్టప్రయోగః-కరకిసలయం భూత్వా ధూత్వా విమార్గతి వాససీ (కావ్యాలంకారసూత్రవృత్తి ౫-౬)

'సూ ప్రాణిని నీలేతి చింత్యమ్ - 'కువలయదల నీలా కోకిలా బాలచూ'తేత్యాదిషు నీలేతి చింత్యమ్ కోకిలా నీలీతి భవితవ్యమ్ నీలశబ్దాత్ 'జానప' దేత్యాదిసూత్రేణ 'ప్రాణిని' చేతి జీష్విధానాత్ ' (కావ్యాలంకారసూత్రవృత్తి ౫-౮౬)

ఇంతయేల? ప్రమాదములు తమ కావ్యములలోఁగల వని యా కావ్యములు వ్రాసినకవులే యంగీకరించినారు

'సతు యథా మమ తత్రైవ—

భక్తిః కాతరతాం క్షమా సభయతాం
పూజ్యస్తుతి ర్దీనతాం
ధైర్యం దారుణతాం మతిః కుటిలతాం
విద్యాబలం క్షోభతాం,
ధ్యానం వంచకతాం తపః కుహకతాం
శీలవ్రతం మండతాం
పైశున్యవ్రతినాం గిరాం కిమివవా
నాయాతి దోషార్ద్రతామ్

అత్ర పిశునస్వభావే వర్ణ్యమానే భక్త్యాదీనాం గుణానాం వైపరీత్యే ప్రతిపాదితే పిశునానాం వచసాం కింవా దోషార్ద్రతాం నాయాతీ త్యభిహితే స్వయమనార్ద్రస్వభావస్య పరార్ద్రీకరణ మనుచితమేవ" (ఔచిత్యవిచారచర్చ —౨౮ పుట)

ఇట్టివనేకములు గలవు క్షేమేంద్రాదులు మహాకవులు; బహుగ్రంథకర్తలు ఇట్లు వారే తమకుఁ బ్రమాదములు కల వనుచుండ మనము లేవనుట పరిహాసాస్పదము.

వస్తుస్థితి యిట్లుండ శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు "కవులకుఁ బ్రమాదములు లేవు అనఁగాఁ గావ్యములలో నపశబ్దములు లేవు కావ్యభాషానుశాసకమగు వ్యాకరణమునఁ గావ్యములలోఁ గవులు ప్రయోగించిన శబ్దముల నన్నిటిని సాధువు లని సాధింపవలసియున్నది - పాణినీయ మట్లుగాక కావ్యములలోని శబ్దముల నసాధువు లని నిరా

కరించినది కనుకఁ బాణినీయము కావ్యభాషానుశాసకము కా దని వాదించుచున్నారు 'ఛాందసత్వా ద్భవిష్యతి' అను మహాభాష్యము నుదాహరించి వీరు 'విమయపరిశోధనము' నను, 'అనుబంధము'నను వ్రాసిన వ్రాఁతలకుఁ గల పరమార్థ మిదియే కవులకుఁ బ్రమాదములు లేక యపభ్రంశములే కావ్యములలో సంభవింపనిరాఁడు కావ్యభాషకు వ్యాకరణావశ్యకతయే లేదు అపభ్రంశములివి యని నిరూపించి యవి ప్రయోగార్హములు కావనియు సాధుశబ్దము లివి యని నిర్ధారించి యని ప్రయోగార్హము లనియు మన కెఱుకపఱచుట కే వ్యాకరణము. ఇట్టి కృత్యమునఁ బాణినీయము జాగరూకత వహింపఁగా నది యొక దోష మని తలఁచి శ్రీ శాస్త్రిగారు "పాణినీయము కావ్యభాషానుశాసకము కా" దని వాదు లాడుట యెంతవఱకు సమంజసమో విజ్ఞులే పరిశీలింతురుగాక.

---

## కవులు-పాణినీయపరిచయము

పాణినీయము కావ్యభాషానుశాసకము కాదు అనఁగా లక్షణ కర్తలగు మునిత్రయము వారు తమ కాలమునకుఁ గల కవుల వాఙ్మయమును బ్రమాణముగాఁ జేసికొని తాము లక్షణ మేర్పఱపలేదు పాణినీయమునకుఁ దరువాతి మహాకవులు తమ కావ్యవాఙ్మయమునకుఁ బాణినీయమును బ్రమాణముగాఁ గొనలేదు" అని శ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారి వాదము ఇతర వాఙ్మయముతో పాటు కావ్యవాఙ్మయమునుగూడఁ బ్రమాణముగాఁ గొని మహాకవి

ప్రయోగము లనేకములు మహాభాష్యములో సాధింపఁబడి నవి కనుకను, మఱికొన్ని నిదర్శనములు సయితమీ వాదము నకు విరుద్ధములుగా నున్నవిగనుకను మునిత్రయమువారి యాశయ మట్టిది కాదని మఱియొకచో నిరూపించితిని. (చూ పాణినీయపరిశోధనము, అనుబంధపరామర్శములోని మహా కవిప్రయోగసాధనము-మహాభాష్యఫక్కి- అనుశీర్షకము)

ఇఁకఁ బాణినీయమునకుఁ దరువాతి మహాకవులు తమ వాఙ్మయమునకుఁ బాణినీయము ప్రమాణముగాఁ గొనిన వారు కా రనువాదము యుక్తియుక్తము కాదని కావ్యము లలోఁ గవు లుదాహరించిన వచనములఁబట్టియే నిరూపిం చుచుఁ గవులకుఁ గల పాణినీయపరిచయమునుగూడఁ గొంత విశదపఱచెదను సుప్రసిద్ధమహాకవుల కావ్యములే కొన్ని ప్రత్యక్షముగాఁ బాణినీయము కావ్యభాషానుశాసక మని సాక్ష్య మిచ్చుచున్నవి. వానిని గొన్నిటి నిట నుదాహరిం చెదను.

## రావణార్జునీయము

పాణినీయసూత్రములను బై నుదాహరించి వానికిఁ గ్రింద లక్ష్యముగా నీ మహాకావ్యమును భీమసేనమహాకవి రచించినాఁడు పాణినీయలక్ష్యముగా నిట్లు వ్రాయఁబడిన యీ మహాకావ్యము కవులు తమ భాషకుఁ బ్రమాణముగాఁ గొనునది పాణినీయ మని నిర్వివాదముగాఁ జాటుచున్నది గదా ఈ కావ్యములోని శ్లోకపాదములు రెండు మహాభాష్య కర్త 'అను వాదే చరణానామ్' అను సూత్రమునకు లక్ష్య ములుగాఁ బ్రదర్శించి సాధించినాఁడు

## భట్టికావ్యము

భట్టి పై కావ్యమును జూచియె యీ కావ్యమును వ్రాసినాఁడు పాణినీయసూత్రములు మాత్ర మిం దుదాహరింపఁబడలేదు వ్యాకరణమునకు లక్ష్యముగా నీ కావ్యమును వ్రాసినా నని యీగ్రంథకర్తయే యంతమునఁ జెప్పికొని నాఁడు ఆ వ్యాకరణము పాణినీయమని యీకావ్యమే చాటు చున్నది ప్రతిపదమును నిందుఁ బాణినీయానుశిష్టమే రామ భద్రయజ్వ పతంజలిచరితమునఁగూడ నీతఁడు చదివినది పాణి నీయమనియే వ్రాసినాఁడు (దీని వివరములు చూ 'భట్టి-అతనికావ్యము')

## వాసుదేవ విజయము

పాణినిరచితమగు నష్టాధ్యాయికి లక్ష్యముగా శ్రీకృష్ణ చరిత్ర ప్రతిపాదకమగు నీ మహాకావ్యము వాసుదేవకవిచే వ్రాయఁబడినది పాణినీయలక్ష్య మీమహాకావ్య మని యొక మహాకవి తన కావ్యారంభమున నిట్లు పేర్కొనినాఁడు "ఉ దాహృతం పాణిని సూత్రమండలం ప్రాగ్వాసుదేవేన' (ధాతు కావ్యము ౧-౧) వ్యాఖ్య— పాణినేః సూత్రాణి పాణిని సూత్రాణి తేషాం మండలం సమూహః ఉదాహృతం ఉదా హరణైః ప్రకాశీకృతమ్" స్థాలీపులాకన్యాయముగాఁ బాఠక లోక మెఱుఁగుటకు రెండు శ్లోకములు వాసుదేవవిజయకావ్య మునుండి యిట నుదాహరించెదను

"పైతృష్వస్రీయాశ్చ మాతృష్వసేయాః
కుల్యా స్స్వస్రీయాశ్చ కాల్యాణినేయాః

యే భ్రాతృవ్యా యే శ్వశుర్యాః కులీనాః
కారవ్యా యే చాపి మాహాకులీనాః"
"యే వా గర్గా యేచ దాసేరదేశ్యా
స్తాక్షణ్యాద్యా యే పున ర్ధాష్కులేయాః,
సర్వాణ శౌరి ర్వృత్తసర్వాగమ స్తా
నార్చీ దుచ్చై ర్దిష్టికోఽనుప్రధానమ్"

(౧-౬౭, ౬౮)

ఇఁకఁ బాణినీయసూత్రము లెన్ని యీ శ్లోకగర్భమున నణఁగియున్నవియో గమనింపుఁడు

పైతృష్వస్రీయాః—(పితృష్వసు శ్ఛణ్) అపత్యార్థమున 'ఛణ్' ప్రత్యయము

మాతృష్వసేయః—(మాతృష్వసుశ్చ) 'ఢక్' ప్రత్యయము, (ఢకి లోపః) లోపము

కుల్యాః—(అపూర్వపదా దన్యతరస్యాం యడ్ఢకఞౌ) 'యత్' ప్రత్యయము

స్వస్రీయాః—(స్వసు శ్ఛః) ఛ ప్రత్యయము.

కాల్యాణినేయాః—(కల్యాణ్యాదీనా మినఙ్) ఢక్ ప్రత్యయము 'ఇనఙ్' ఆదేశము

భ్రాతృవ్యాః—(భ్రాతు ర్వ్యచ్చ) 'వ్యత్' ప్రత్యయము

శ్వశుర్యాః—(రాజశ్వశురా ద్యత్) 'యత్' ప్రత్యయము.

కులీనాః—(కులా త్ఖః) ఖ ప్రత్యయము.

కారవ్యాః—(కుర్వాదిభ్యో ణ్యః) ణ్య ప్రత్యయము.

మాహాకులీనాః—(మహాకులా దఞ్ ఖఞౌ) 'ఖఞ్' ప్రత్యయము

గర్గాః—(గోత్రస్త్రియాం కుత్సనే ణచ) 'ణ' ప్రత్యయము

దాసేర—(క్షుద్రాభ్యోవా) 'ఢక్' ప్రత్యయము.

తాక్షణ్యాద్యాః—(సేనాంతలక్షణకారిభ్యశ్చ) 'ణ్య' ప్రత్యయము.

దౌష్కులేయాః—(దుష్కులా ఢ్ఢక్) 'ఢక్' ప్రత్యయము.

దైష్టికః—(అస్తినాస్తిదిష్టంమతిః) 'ఠఞ్' ప్రత్యయము

కావ్యమంతయు నిట్లే యున్నది పాణినీయము కావ్యభాషానుశాసక మనుట కీ కావ్యపద్య మొక్కటి చాలదా?

సభ్యాభరణము

ఇది పాణినీయమును శ్లేషభంగితోఁ బ్రతిశ్లోకమునను నభివర్ణించుచు వ్రాసిన ద్వ్యర్థి కావ్యము. ఈ క్రింది శ్లోకములను దిలకింపుఁడు.

"పాణినీయార్థకనకైః కలితశ్లేషమౌక్తికైః,
తన్యతే రామచంద్రేణ సభ్యాభరణ ముత్తమమ్
"విభాషా సాకాంక్షే లృటఇవ న యస్య క్వచిదపి
క్వచి చ్చావజ్ఞానం పరిభవ ఇ వ్యో దేతి చ న యః,

నిషేవే న్నిందాదీ న్న చ వృశివ యస్తం ప్రణమతా
వదాతం సచ్ఛబ్దప్రథిత ముదితం శానచ మివ"

(సభ్యాభరణము, సవ్యాఖ్యానము. చూ ఓరియంటల్ లైబ్రరీ, నం R ౬౭౯)

ఇట్టి పుస్తకము లింకను ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁ దాటియాకుల ప్రతులలో నణఁగియున్నవి

ఈ కావ్యములనుబట్టి యూహింపుడు—పాణీయమునఁ గవు లెంతగాఁ బరిశ్రమించిరో కావ్యభాషానుశాసకము కాని పాణినీయమున నింతటిపరిశ్రమము వా రేల సలుపవలయును? పరిశ్రమించినను నావ్యాకరణమున కీ మహాకావ్యములలోఁ దా వ్రేసఁగ నేల? పాణినీయమునకంటె విలక్షణముగాఁ గావ్యభాషానుశాసకమగు మఱియొకవ్యాకరణమే కవులనాఁ డుండినచో దానినే శ్లేషభంగులతోఁ గవు లభివర్ణింపరా? ఉపమాదులతో నుపమింపరా? ఉత్ప్రేక్షాదులతో నుత్ప్రేక్షింపరా? తుదకుఁ దన్నామస్మరణమునకైనను గడఁగిన మహాకవి లేఁడే! మహాకావ్యము లేదే! మఱియును వ్యాకరణావశ్యకత కవులకుఁ గలదని మహాకవు లీక్రిందివిధమున వ్రాసియున్నారు

"సంస్కారవత్యేవ గిరా మనీషీ"

(కు సం ౧-౨౮)

"కపయ స్తదవేక్షణే తరూ
న్వ్యథయామాసు రసాధుభిః పదైః,

పదశాస్త్ర ఇ వానధీతినః
కవయః కర్ణపథా న్వివశ్ఛితామ్"
(పతంజలిచరితము, 3-3౬)

హేమచంద్రుఁడుకూడఁ గావ్యానుశాసనమున 'వ్యుత్ప త్త్యభ్యాసాభ్యాం సంస్కార్యా' అను సూత్రమునందుఁ గవికి వ్యాకరణపరిచయ మావశ్యక మనినాఁడు ఆ వ్యాకరణము పాణినీయమే యని మన మనుచున్నాము కాదని శ్రీశాస్త్రి గారు వాదులాడుచున్నారు ఐనఁ గవులు పాటించిన కావ్య భాషానుశాసకమగు మఱియొక వ్యాకరణ మేది యని మనము శ్రీశాస్త్రిగారి నడుగుదము వారు కవులనాఁటి కది సుప్రసిద్ధ ముగా నుండి యీనాఁడు నశించిన దందురా ? ఆనాఁడట్టి వ్యాకరణమే లేక యీనాఁ డది క్రొత్తగా వ్రాయఁబడ వలయు నందురా ? వ్యాకరణమును జదువని కవులను గపు లతో నుపమించుచున్న మహాకవులు నాఁడు కావ్యరచనోప యోగి వ్యాకరణమే లే దనువాదము నంగీకరింపరు ఇఁకఁ గావ్యరచనోపయోగి వ్యాకరణము కవులనాఁటికే ప్రసిద్ధమై యున్న వారు దానినామ మైనను స్మరింపకుండుటయు శాస్త్రిగారి సిద్ధాంతప్రకార మే శిష్ట వ్యవహారభాషకొఱకో రచింపఁబడి కావ్య వాఙ్మయమున కుపకరింపక యజాగళ స్తనమువలె నున్న పాణినీయము నప్రస్తుతముగాఁ దమ కావ్య ములలోఁ బూర్వము నాయుదాహరించిన శ్లేషభంగులతో డను, ముం దుదాహరింపనున్న యుపమాదులతోడను ననేక విధములుగా నభివర్ణించుటయు నసంగతము కావున వ్యాకర ణావశ్యకత గల మహాకవులు సర్వభాషానుశాసకము గు వ్యాక

ర్థణమునే కావ్యవాఙ్మయమునకును ప్రమాణము గాఁ బాటించి రనుట నిర్వివాదాంశము. ఇఁకఁ గవులు 'పాణినీయము కావ్యభాషానుశాసక' మనుటకుఁ గావ్యములలోఁ జూపిన మతికొన్ని నిదర్శనములు సయితము మహాకావ్యములనుండి యీక్రింద నుదాహరించి వారి పాణినీయపాండిత్యమునుగూడఁ బాఠకలోకమునకు వెల్లడించెదను

శిశుపాలవధము-మాఘమహాకవి

"నిపాతితసుహృత్స్వామి
పితృవ్యభ్రాతృమాతులమ్
పాణినీయ మి వాలోచి
ర్ధీరై స్తత్సమరాజిరమ్ (౧౯-౭౫)

ఈ శ్లోకమున మాఘమహాకవి యుద్ధభూమిని పాణినీయముతో నుపమించినాఁడు మిత్త్రులు ప్రభువులు పితృవ్యులు భ్రాతలు మాతులులు సంహరింపఁబడినారు—అని యుద్ధపరమగు నర్థము. పాణినీయమునఁ బ్రక్రియాప్రదర్శనము లేకయే స్వస్వరూపములలోఁ గొన్ని శబ్దములు సూత్రాదులలో నుచ్చరింపఁబడి సాధువు లగుచున్నవి అట్టి శబ్దములు వైయాకరణ సంప్రదాయ ప్రకారము నిపాతము లనఁబడును ఈ క్రిందిశబ్దములను పాణిని స్వసూత్రములలో నిట్లు నిపతించినాఁడు:

"సుహృ ద్దుర్హృదౌ మిత్రామిత్రయోః', "స్వామి న్నైశ్వర్యే',"పితృవ్య మాతుల మాతామహ పితామహాః', 'న ప్తృ నేష్టృ త్వష్టృ హోతృ పోతృ భ్రాతృ జామాతృ మాతృ పితృ దుహితృ (ఉణాది, ౨ పా)

కావుననే నిపాతిత సుహృత్స్వామి పితృవ్య భ్రాతృ మాతులము పాణినీయ మనినాఁడు మహాకవి మతియొకచో-

అనుత్సూత్రపదన్యాసా
సద్వృత్తి స్సన్నిబంధనా,
రాజవిద్యేవ నోభాతి
రాజనీతి రపస్పశా (౨-౧౧౨)

పాణినీయమునకుఁ గాశికావృత్తి న్యాసము మొదలగు వ్యాఖ్యానము లెన్నియో కలవు వినను 'పస్పశము' లేని పాణినీయమువలెఁ జారులు లేని రాజవిద్య రాణింపదని యీ మహాకవి యనినాఁడు వ్యాకరణ ప్రయోజనాద్యనేకవిషయములఁ జర్చించుచుఁ బాణినీయమున కుపోద్ఘాతరూపముగా మహాభాష్యమునఁ బ్రథమాహ్నికమును బతంజలి రచించి నాఁడు దీనికిఁ బస్పశ మని పేరు

ఇట్లు పాణినీయమును, తద్వ్యాఖ్యానములను నామ నిర్దేశముతో గ్రహించి శ్లేషభంగితో నుపమించియున్న మహాకవి పాణినీయము కావ్యభాషానుశాసకము కాదని నాఁడా ?

నైషధము - శ్రీహర్షుఁడు

'ఇహ కిముషసి పృచ్ఛాశంసి కిం శబ్దరూప
ప్రతినియమితవాచా వాయసే నైష పృష్టః
భణ ఫణిభవశాస్త్రే తాతఙః స్థానినా కా
వితి విహితతుహీవాగుత్తగః కోకిలోఽభూత్ '

(౧౯-౬౦)

"ఓ నలమహారాజా కాకు లఱచుచున్నవి కోయి లలు కూయుచున్నవి తెలతెలవాఱవచ్చినది నిద్రమేల్కొను" మని దీనిభావము

ఈ భావమునే కవి యీ క్రిందిరీతిని జమత్కరించెను ప్రాతఃకాలమున 'కా, కా' యని కాకు లఱచుటయు, 'తుహీ, తుహీ' యని కోయిలలు కూయుచుండుటయు సుప్రసిద్ధము 'కా' అనునది ప్రశ్నార్థక మగు కింశబ్దమునకుఁ బ్రథమాద్వి వచనరూపము అట్లగుటచేఁ దమజాతి వైరమును బురస్క రించుకొని వాయసము పికమును బాణినీయమునఁ బరీక్షించు చున్నది 'కా, కా —'తాతఙ్' ఆదేశము వచ్చు స్థాను లేవి యని. కోయిల ప్రశ్నానుగుణ మగు సమాధానము నిచ్చు చున్నది 'తుహీ, తుహీ' అని పాణినీయమున భూధాతువు యొక్క భవతాత్-భవతాత్' అను ప్రథమ మధ్యమపురు షైకవచనములను సాధించుటకు 'తు' (ప్రథమపురుషైకవచ నము), హి (మధ్యమపురుషైకవచనము) అను స్థానులకు 'తుహ్యో స్తాత జ్ఙాశి ష్యన్యతరస్యామ్' అను సూత్రముచే 'తాతఙ్' ఆదేశమును బాణిని విధించినాఁడు [చూ 'శ్రీ నాథుఁడు-కొన్ని ప్రయోగములు' అను నావ్యాసము ]

దీని పై శ్లోకమునుగూడఁ దిలకింపుఁడు

"దాక్షీపుత్త్రస్య తంత్రే ధ్రువ మయ మభవ
త్కోఽప్యధీతీ కపోతః
కంఠే శబ్దౌఘసిద్ధిక్షతబహుకఠినీ
శేషభూషానుయాతః,

సర్వం విస్మృత్య దైవాత్స్మృతి ముషసి గతాం
ఘోషయ న్యో ఘుసంజ్ఞాం
ప్రాక్సంస్కారేణ సంప్రత్యపి ధువతి శిరః
పట్టికాపాఠజేన"

మెడమీఁది తెల్లని తనూరుహపంక్తి కంఠమునఁ దాల్చిన బలపపుభూషణమువలె నుండ నొకపావుర ముషఃకాలమున నొకచోఁ గూర్చుండి తలయూఁపుచు 'ఘు ఘు' అని కూయుచుండెను దానిని జూచి కవి యిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు "ఈకపోతము పూర్వజన్మమున దాక్షీపుత్త్రుఁడగు పాణినిమునికి శిష్యుఁడైన కపోతుఁడై యుండవచ్చును కావున నే పాణినియొద్దఁ దాఁ జదివిన వ్యాకరణమంతయును మఱచిపోయి దైవికముగా నుషఃకాలమున స్మృతికి వచ్చిన 'దాధా ఘ్వదాప్' అను పాణినిసూత్రవిహిత 'ఘు' సంజ్ఞను— వెనుకటి జన్మమునఁ బలకపై వ్రాసికొని తలయూఁపుచు వల్లించి యుండుటచే నిప్పుడుగూడ నట్లే—తలయూఁచుచు వల్లించుచున్నది' అని

ఇట్లు తన కావ్యములోఁ బాణినీయమునందలి స్థాన్యాదేశములను, సంజ్ఞలనుగూడ నుత్ప్రేక్షలతోఁ జిత్రించిన యీ మహాకవి పాణినీయము తన కావ్యభాష కనుశాసకము కాదనియే చెప్పినాఁడా ?

## వాసవదత్త - సుబంధువు

"వ్యాకరణేనేవ సరక్తపాదేన" (౭౧ పు).

వ్యాఖ్య—"తేన రక్తం రాగాత్ ఇత్యాదిపాదః రక్త పాదః '

మఱియొకచో—"వ్యాకరణమివ స్త్రీనదీకృత్య బహులమ్" (౮3 పొ).

వ్యాఖ్య—"స్త్రీనదీకృత్యబహులమితి—వ్యాకరణే స్త్రీప్రత్యయః నదీసంజ్ఞా, కృత్యప్రత్యయః బహులగ్రహణంచ'

స్త్రీప్రత్యయములు 'స్త్రియామ్' అను నధికారమున విధింపఁబడిన జీపాదులు

కృత్యప్రత్యయములు 'కృత్యాః ప్రాఙ్ ణ్వులః'
బహులము—'కృత్యల్యుటోబహులమ్' ఇత్యాదులు,
ఇవి యన్నియుఁ బాణినీయముననే కానఁబడుచున్నవి.

విశ్వగుణాదర్శము-వేంకటాధ్వరి

ఈతఁడు పాణినీయమునుగూర్చి యిట్లు ప్రసంగించి నాఁడు.

"అస్వీకృతవ్యాకరణౌషధానా
మపాటవం వాచి సుగాఢ మాస్తే,
కస్మింశ్చి దుక్తే తు పదే కథంచిత్
స్వైరం వపుః ఖద్యతి వేపతే చ

పాణినీయమును జదువనివాఁడు సంస్కృతమున నొక మాట మాటాడుటకైనను ధైర్యము చాలక యపశబ్దభయమునఁ జైత్యరోగివలె శరీరమంతయు వడఁకాడ స్వేదమున మునిఁగి తేలునఁట. కావుననే కాదా? నాఁటి వ్యవహారము

నకు నయితము పాణినీయము మూలాధారమని యీకవి యొప్పికొనినాఁ డనుట కిఁక సభ్యంతర మున్నదా ?

"కృశానుః—కథం సఖే, *శతకోటిపాణి నిగదితాదపి పాణినిప్రగదితమేవ వ్యాకరణ మాద్రియతే ?

విశ్వావసుః—పాణినీయమేవ వ్యాకరణంహి ప్రాయే ణానౌపాధికప్రవిశదప్రతీతికారణ మితి తత్రైవాదరః పండితా నామ్"

వ్యాఖ్య—"పాణినే రిదం పాణినీయమ్ అనౌపాధికం వ్యాకరణాంతరానపేక్షం యథా తథా ప్రవిశదాయాం నిర్దో షాయాం ప్రతీతౌ శబ్దతత్త్వవిజ్ఞానేకారణం పాణినివ్యాకరణ మేవ'

ఐంద్రాదివ్యాకరణము లనేకము లుండఁగాఁ బాణినీయ మునే యెల్ల రాదరించుటకుఁ గల కారణ మేమని కృశానుఁ డడిగినాఁడు. ఇతర వ్యాకరణములవలె వ్యాకరణాంతరాపేక్ష లేక సాధుశబ్దముల నశేషముగా సాధింపఁగలుగుటయే పాణి నీయమును బుధులాదరించుటకుఁ గల కారణ మని విశ్వా వసుఁ డనుచున్నాఁడు

మన శతగ్రంథకర్త మఱియు నేమనుచున్నాఁడో పరి శీలింతము

"సూత్రం పాణినిబద్ధం
కంఠే కలయన్ సముద్వహతి సుదృశమ్

* శతకోటిః పాణౌ యస్య సః—ఇంద్రః

వర్ణాదీనాం ధర్మాన్
బుద్ధ్వా విధివ ద్బుధః ప్రయుంక్తేఽసౌ
(విశ్వ వైయాకరణప్రశంస)

బుధుల శబ్దప్రయోగము పాణినీయమూలక మని స్పష్టముగా నుడువుచున్నాఁడు. వేంకటాధ్వరి 'అసౌ బుధః ప్రయుంక్తే' అని తాను వ్రాసిన కావ్యము లన్నియుఁ బాణినీయ మూలకములే యని వ్యంగ్యమర్యాదాభిజ్ఞుల కెఱుకపఱచినాఁడు పాణినీయము కావ్యభాషానుశాసక మని కవు లొప్పికొనినా రనుట కిఁక సందేహ మేమైనఁ గలదా?

## మఱియొక మహాకవి

"నపుంసక మితి జ్ఞాత్వా ప్రియాయై ప్రేషితం మనః
తత్తు తత్రైవ రమతే హతాః పాణినినా వయమ్"
(చాటువు)

మనశ్శబ్దము నపుంసక మని పాణిని చెప్పఁగా నీకావ్య కర్త తెలిసికొనినాఁడఁట

## నామలింగానుశాసనము - అమరసింహుఁడు

ఈకోశ మనేక మహాకవి ప్రయోగములఁ బరిశీలించి కావ్యభాషకొఱ కేర్పఱుపఁబడిన దని యందఱకు విదితమే కదా ఇందలి పదము లన్నియుఁ బాణినీయానుశిష్టములే కనుకనే యొకమహాకవి "అమరసింహో హి పాపీయాన్ సర్వం భాష్య మచూచురత్" అనినాఁడు పాణినీయమహాభాష్యమును నిశ్శేషముగా నమరసింహుఁడు దొంగిలించినాఁ

డఁట అమరకోశములోని పదము లన్నియుఁ గావ్యభాషలోనివి

ఇఁక నేమైనదో కొంచెమాలోచింపుఁడు పాణినీయము కావ్యభాషానుశాసక మైనది ఇది కాక భోజుఁడు హేమచంద్రుఁడు మొదలుగాఁగల లక్షణకర్తలగు మహాకవు లెల్లరును దమ లక్షణగ్రంథములలోఁ బాణినీయమునుబట్టియే మహాకావ్యప్రయోగముల సాధుత్వాసాధుత్వములఁ జర్చించిరి.

ఇట్లు కవులందఱు నేకముఖముగాఁ గావ్యభాషకు మేమాదరించిన వ్యాకరణము పాణినీయమే యని స్వవచనములలో మన కెఱుకపఱచుచున్నారు కవు లాధారముగాఁ గొనినది పాణినీయము కాదని శ్రీ శాస్త్రిగా రనుచున్నారు పాఠకులారా! మన కెవరివాద మంగీకరణీయమో మీరే నిర్ణయింపుఁడు

---

## 3 భట్టి— అతనికావ్యము

ఈ కావ్యమునుండియే' తం పాతయాం ప్రథమ మాస' అను ప్రయోగమును శ్రీ శాస్త్రిగా రుదాహరించి యున్నారు ఈ కావ్యమును రచించినవాఁడు భర్తృహరి ఈ గ్రంథకర్త వ్యాకరణమునకు లక్ష్యముగాఁ దనగ్రంథమును వ్రాసితినని తానే చెప్పియున్నాఁడు

శ్లో॥ దీపతుల్యః ప్రబంధోఽయం, శబ్దలక్షణ చక్షుషామ్।
హస్తామర్ష ఇవాన్ధానాం భవేద్వ్యాకరణాదృతే
(భట్టికావ్యము. ౨౨ 33)

ఇఁక నా వ్యాకరణ మేది యనునది మనకిటఁ జర్చనీయము. పాణినీయమునఁ దగుప్రవేశము కలిగి సంపూర్ణముగా నీకావ్యము పరిశీలించినవా రిది పాణినీయమునకు లక్ష్యమనుటకు సందేహింపరు దీని వ్యాఖ్యాత లెల్లరును బాణినీయ సూత్రములచేత నే యిందలిశబ్దముల నెల్ల సాధించి పాణినీయమునకే దీనిని లక్ష్యమనిరి పాణినిమహర్షి "ప్రోష్యపాపీయాన్‌ అనునానుపూర్వితో నొకశబ్దమును మయూరవ్యంసకాదిగణమునఁ బఠించి సాధించినాఁడు నేఁటివిద్వాంసులలో నే యొకరిద్దఱో తప్పఁ దక్కినవా రిది సమస్తపదమని యెఱుఁగక ప్రోష్య పాపీయాన్‌ అని పదచ్ఛేదము చేయుస్థితిలో నున్నారు ఈశబ్దమును దనకావ్యములో భట్టి సందర్భానుగుణముగా నెట్లు ప్రయోగించినాఁడో పరికింపుఁడు

శ్లో॥ సంగచ్ఛపౌంస్నిసైౢణంమాం యువానం తరుణీ శుభే
రాఘవః ప్రోష్యపాపీయాన్‌ జహీహి తమకించనమ్.

(భట్టి ५ ६०)

"రాఘవః ప్రోష్యపాపీయానితి - పాపశబ్దాత్ "విన్మతోర్లు' గితి ఈయసుని లుక్ప్రమతుపః ప్రోష్యపాపీయానితి 'మయూరవ్యంసకాదయ శ్చేతి సః దేశాంతరం యాత్వా పాపవత్తరః" (జయమంగలవ్యాఖ్య) ఈ కావ్యమునుండి మచ్చునకై యిదియొకటి ప్రదర్శించితిని గాని కావ్యమంతయుఁ బాణినీయమర్మముల వెల్లడించు నిట్టివిశేషములతోనే నిండియున్నది ఇతఁడు 'రావణార్జునీయము' నాదర్శముగాఁ గొని యీకావ్యమును రచించినాఁడు రావణార్జునీయ కావ్యస్వరూ

పమును నేను మఱియొకచో విశదీకరించియున్నాను దీనిని రచించిన భీమసేనకవి పైని పాణినిసూత్రములు వ్రాసి క్రింద వానికి లక్ష్యములుగాఁ దనపద్యములను రచించినాఁడని యందుఁ దెలిపియున్నాను కావున నీ భట్టికావ్య రచనకుఁ బూర్వమే పాణినీయము సుప్రసిద్ధమై కవులకుఁ జేయూఁత యిచ్చియున్నది అందుచేతనే భట్టి తదనుసారముగనే తన కావ్యము రచించినాఁడు ఇంతయేల? 'పణినాపత్య' ప్రయోగసందర్భమున శ్రీ శాస్త్రిగారే చారిత్రికవిషయమునకుఁ బ్రమాణముగా నుదాహరించిన 'పతంజలిచరిత్రము'న రామభద్రయజ్వ యీకావ్యమునుగూర్చి యేమనుచున్నాఁడో తిలకింపుఁడు.

> శ్లో॥ బుద్ధ్యాగ్రిమోఽపి జనుషా చరమః కనీయాన్
> రామస్య రాక్షసరిపో శ్చరితప్రబంధమ్,
> నామాగ్రజస్య పరిగృహ్య స భట్టికావ్య
> మి త్యాతతాన సుపదైః పదశాస్త్రలక్ష్యైః ॥
> (పతం-౮-౯)

ఆపదశాస్త్ర మేదియో యితఁడే యిట్లు విశదీకరించి యున్నాఁడు

> శ్లో॥ క్షితిగర్భమందిరగతః పతంజలే
> రపతీ త్కృతించ రిపుకుంజరాద్గురోః (పతం ౭-౩౦)

ఈ పతంజలిచరితమువలనఁ దన తండ్రియొద్ద నీతఁడు పఠించినది పాణినీయమని బోధపడుచున్నది ఈ గ్రంథమునఁ గల యితనిగాథ నొకింత యిట విశదీకరించెదను చంద్రగు

పుత్రుఁడను బ్రాహ్మణుఁ డీతనితండ్రి చంద్రగుప్తుఁడు పతంజలి శిష్యునివలనఁ బాణినీయము సమగ్రముగాఁ జదివిన మహా వైయాకరణుఁడు ఇతఁడు నాలుగువర్ణములయందును నలు గురుస్త్రీలను వివాహమాడెను క్రమముగా నితనికి బ్రాహ్మ ణియందు వరరుచి, క్షత్రియాణియందు విక్రమార్కుఁడు, అర్యాణియందు భట్టి శూద్రయందు భర్తృహరి యను నలు గురుకుమారులు కలిగిరి విక్రమార్కుఁడు రాజయ్యెను భట్టి మంత్రిపదము నధిష్ఠించెను వరరుచి యాస్థానవిద్వత్పదవిన ధిరోహించెను భర్తృహరియందుఁ దండ్రికిఁ బ్రీతి మెండు ఇతఁడు తండ్రియొద్దఁ బాణినీయమును సమగ్రముగాఁ జదివి తన యన్నయగు భట్టిపేర నీకావ్యమును బాణినీయలక్ష్య ముగా వ్రాసెను పాఠకులారా ఈతఁడు చదివినది పాణి నీయము వ్రాసినది వ్యాకరణలక్ష్యమగు మహాకావ్యము ఏ వ్యాకరణమునకు లక్ష్యముగా నితడీ గ్రంథమును వ్రాసె నో యిఁక వేఱుగాఁ జెప్పనక్కఱలేదు కైయటాదులకంటె మున్నె మహాభాష్యమునకు హరికారిక లనుపేరు గల సపాద లక్ష శ్లోకాత్మకవివరణగ్రంథమును రచించిన మహావిద్వాం సుఁ డితండే ఇట్లు భట్టికావ్యము పాణినీయమునకు లక్ష్యముగా వ్రాయఁబడిన మహాకావ్యమని స్థిరపడియుండ నీకావ్యము నుండియే యపాణినీయము—పాణినీయము కావ్యభాషాను శాసకము కాదనుకొని ప్రయోగించినది—అని యొకలక్ష్య మును బ్రదర్శింప శ్రీ శాస్త్రిగా రెట్లు సాహసించిరో తెలియదు

---

'మహాకవిప్రయోగసాధనము-మహాభాష్యఫక్కి'

'తపసః పరస్మైపదం చ'—తపసః పరస్మైపదంచేతి వక్తవ్యమ్ తపశ్చరతి-తపస్యతి కథమ్—'తపస్యతే లోకజిగీషురగ్నేః ఛాందవత్వాద్భవిష్యతి' (మహాభాష్యము, 3. ౧ ౨ ౧౫)

ఈ మహాభాష్యము నుదాహరించి శ్రీ శాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు. 'పైని జూపిన భాష్యములోని భారత రామాయణాది ప్రయోగసాధనఫక్కి నరయునపుడు పాణినీయము భారతరామాయణాది ప్రయోగానుశాసకము కాదను విపరీతనిశ్చయము కల్గక మానదుగదా "

(అనుబంధము-౫ ౬. పొ)

పాణినీయమునుబట్టి సాధువు లని మహాభాష్యకర్త సాధించిన మహాకావ్యప్రయోగము లనేకములు (భారతి ౧౯-32 లోని) నావ్యాసమున నుదాహరింపబడినవి (చూ. పాణినీయ పరిశోధములోని 'మహాకవిప్రయోగములు-మహాభాష్యము) అం దొకదాని నైనను శ్రీశాస్త్రిగారు పాఠకలోకమునకుఁ జూపింపక యతఁ డసాధు వని త్రోసిపుచ్చిన యొక యార్షప్రయోగమునుమాత్ర మీ యనుబంధమున నుదాహరించి మహాకవి ప్రయోగముల సాధించిన మహాభాష్యఫక్కి యిట్టిదియే యని పాఠకులకుఁ 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'దను విపరీతనిశ్చయ మొకదానిని గలిగింపఁజూచిరి ఈవ్రాఁత లెంతవఱకు సత్యములో పరిశోధింతము

పెద్దలయెడ నితరులయెడకంటె గౌరవబుద్ధిని సర్వవిషయములందును బ్రకటించుచుండుట లోకాచారము ఆచార్యుఁడు వచ్చెననుటకు బదులుగా నాచార్యులవారు వచ్చిరందుము ఇట్లే యితరవ్యవహారములయందును నితరులయెడ కంటె విలక్షణముగాఁ బెద్దలను మనము గౌరవించుచుండుట లోకజ్ఞు లెఱుఁగనిది కాదు అట్టివారేవిషయముననైనఁ బ్రమాదపడినప్పు డది ప్రమాద మనుటకు బదులుగా నాలోచింపుఁ డనియో లేక మఱియొకరీతినో మన మనుచున్నాము ప్రతివాదిమతఖండనమునఁగూడఁ బరవాదము దుర్బల మని నిరూపించియు చిన్త్య మనియో 'విచార్య' మనియో వ్యాఖ్యాత లనుచుందురు శాస్త్రములలో బహులముగా నిట్లే కానవచ్చును అట్లే పతంజలిభగవానుఁడును శాస్త్రకర్తలు మహాకావ్యకర్తలును బ్రమాదపడినప్పుడు 'ఛాన్దసత్వాద్విస్మృతి' అనుచుందును ఛందస్సమకక్ష మగుప్రమాణదృష్టితో వీరిప్రయోగములు సాధువు లనఁ దగిన వని దీనియాశయము వైదికప్రయోగము లెట్లు లోకమునఁ బ్రయోగార్హములు కావో యట్లే యీప్రయోగములును లోకమునఁ బ్రయోగార్హములు కావని యిందలి రహస్యము ఒకగ్రంథమునకు లక్షణ మేర్పఱచునప్పు డందుండు గుణములు స్వీకార్యము లని నిరూపించుటయు దోషములు పరిహార్యము లని నిరాకరించుటయు లక్షణకర్తలకృత్యములు కావుననే సంస్కృతమున మహాకావ్యలక్షణ మేర్పఱచినయాలంకారికు లందఱును మహాకావ్యములనుండియే గుణదోషముల కుదాహర

ణము లొసఁగి గుణములు స్వీకార్యము లనియు దోషములు పరిహార్యము లనియు మన కెఱుకపఱచిరి చూడుఁడు

కావ్యప్రకాశిక—మమ్మటుఁడు

చ్యుతసంస్కృతి—వ్యాకరణలక్షణహీనమ్-యథా—

ఏతన్మన్దవిపక్వతిన్దుకఫలశ్యామోదరా పాణ్డర
ప్రాన్తం హన్త పులిన్దసున్దరకరస్పర్శక్షమం లక్ష్యతే
తత్పల్లీపతిపుత్త్రి కుఞ్జరకులం కుమ్భాభయాభ్యర్థనా
దీనం త్వా మనునాథతే కుచయుగం పత్త్రావృతం మా
కృథాః"

అత్రానునాథత ఇతి 'సర్పిషో నాథత ఇత్యాదావా శిష్యేవ నాథతే రాత్మనేపదం విహితమ్ 'ఆశిషి నాథ' ఇతి అత్ర తు యాచనమర్థః తస్మాత్ 'అనునాథతి స్తనంగమ్' ఇతి పఠనీయమ్" (దోషప్రకరణము)

కావ్యానుశాసనము—హేమచంద్రుఁడు

శబ్దశాస్త్రవిరోధోఽసాధుత్వమ్ 'యథా—

'ఉన్మజ్జన్మకర ఇవాపగాయాః .. ఆజఘ్నే విషమవిలోచనస్యవక్షః'—అత్ర హన్తేర్నాకర్మకత్వమ్ న స్వాఙ్గకర్మకత్వమిత్యాత్మనేపదాప్రాప్తేరాజఘ్నేపద మసాధు

ఇట్లే గుణములకును మహాకావ్యములనుండి లక్షణ కర్త లుదాహరణము లొసఁగినారు కావ్యముల ననుశాసింపఁ దలఁచిన హేమచంద్రుఁడు భారవికావ్యములోని 'ఆజఘ్నే పద మసాధు'వని నిరాకరించినాఁడు ఇతఁడి ట్లనినాఁ డని యీతని కావ్యానుశాసన మిఁకఁ గావ్యానుశాసకము కాదా?

ఇట్లే మహాభాష్యకర్తయు మహాకవుల గ్రంథముల నుండి కొన్ని యపశబ్దముల నుదాహరించి వానిని 'ఛాందసత్వాద్భవిష్యతి ఛందోవత్కవయః కుర్వన్తి న హ్యేషా ఇష్టిః' అని నిరాకరించి యవి ప్రయోగార్హములు కావని మన కెఱుకపఱచినాఁడు అవియే శ్రీశాస్త్రిగారు పైనుదాహరించిన 'తపస్యతే లోకజిగీషురగ్నేః' ఇత్యాదులు కావున 'ఛందోవత్కవయః కుర్వన్తి న హ్యేషా ఇష్టిః' 'ఛాందసత్వాద్భవిష్యతి' అని శాస్త్రకర్త లనుటచేఁ 'బాణినీయము కావ్యభాషానుశాసకము కాదని శ్రీశాస్త్రిగా రనుట యుక్తము కాదు ఇట్లే పదకారులనుగూర్చియు "న హి పదకారా లక్షణేనానువర్త్యాః పదకారైర్నామ లక్షణమనువర్తనీయమ్, యథాలక్షణం పదం కర్తవ్యమ్ (మహాభాష్యము ౮ ౨ ౧ ౧౬) అని మహాభాష్యకర్త యనినాఁడు. ఇతఁడిట్లనెనని పదము క్రమము మొదలగు వేదభాగములకుఁ బాణినీయ మనుశాసకము కాదందుమా? కాదని మన మనినను 'సర్వవేదపారిషదం హీదం శాస్త్రమ్' అని మహాభాష్యకర్త సర్వవేదములను సమగ్రముగా సాధించినది మాశాస్త్రమని కంఠోక్తముగాఁ జెప్పినాఁడు

ఇదిగాక శిష్టవ్యవహారభాషకే పాణినీయ మనుశాసకమని శ్రీ శాస్త్రిగారు సిద్ధాంతీకరించిరిగదా ఐన 'వ్యాకరణమనన్యానతిరిక్తముగా నుండవలయు'నను శ్రీ శాస్త్రిగారి సిద్ధాంతప్రకారము పాణినీయమనుశాసించిన సాధుశబ్దములును, నిరాకరించిన యపశబ్దములును శిష్టవ్యవహారభాషలో నివియే యనక తీరవు కావునఁ బ్రకృతము 'ఛాందసత్వాద్భ

విష్యతి' అని మహాభాష్యకర్త నిరాకరించిన 'తపస్యతే' ము న్నగుశబ్దము లు శిష్టవ్యవహారభాషలోనివియే ఇవి యిట్టి వని శాస్త్రిగా రనుబంధములో సంగీకరించియే యున్నారు. (చూ. అనుబంధము ౮ పా). అప్పుడు 'ఛాందసత్వాద్భవిష్యతి' అను మహాభాష్యధోరణినిబట్టి 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'దని శ్రీ శాస్త్రిగా రెట్లు సిద్ధాంతీకరించిరో యట్లే 'పాణినీయము శిష్టవ్యవహారభాషానుశాసకము కా'దని మన మును దానినిబట్టియే సిద్ధాంతీకరింప వచ్చును కావున 'మహాకవిప్రయోగములే యైనను నసాధువులైనచో మాశాస్త్రమున కవి ప్రమాణములు—లక్షణమేర్పఱపఁ దగిన లక్ష్యములు—కావు మహాకవిప్రయోగములు సాధువులేయైన నవి మాశాస్త్రమునకుఁ బ్రమాణములు—లక్షణ మేర్పఱపఁదగిన లక్ష్యములు—కాకపోవు' అనునదియే పై మహాభాష్యమునకుఁ దాత్పర్యము ఇఁక లక్షణకర్తల ప్రథమకృత్య మగు సాధుశబ్దనిరూపణమున మహాభాష్యకర్తజాగరూకత వహించి సాధువు లగు మహాకవిప్రయోగములు పాణినీయమునుబట్టి సాధించుచు నవి ప్రయోగార్హము లని మన కెట్లు తెలుపుచున్నాఁడో చూడుఁడు

'రామాయణము'

'ఏతి జీవన్తమానన్దో నరం వర్షశతాదపి'
(యుద్ధ ౧౨౬ ౨)

ఈ రామాయణప్రయోగమున మహాభాష్యకర్త "యోగవిభాగః కరిష్యతే—'అనుదాత్తఙ్కిత ఆత్మనేపదమ్' తతః

భావకర్మణోః తతః 'కర్తరి' కర్తరి చాత్మనేపదం భవతి భావకర్మణోః తతః 'కర్మవ్యతిహారే కర్తరీత్యేవ భావకర్మణోఽరితి నివృత్తమ్ యద్యేవ తర్హి కర్మణి కర్తరి భవతి, ఏవం భావేపి కర్తరి ప్రాప్నోతి—'ఏతి జీవన్తమానన్దః ఇతి' అని యోగవిభాగ మొనర్చినప్పుడు దోషోద్ఘాటన మొనర్చి యీ ప్రయోగసాధనముకొఱకు మఱిగొకయోగవిభాగము నొనర్చి దోషము లేదని సాధించుచున్నాఁడు "ద్వితీయో యోగ విభాగః కరివ్యతే 'అనుదాత్తఙిత ఆత్మనేపదమ్ తతో'భావే' తతః 'కర్మణి'—కర్మణి చాత్మనేపదం భవతి తతః 'కర్తరి'- కర్తరి చాత్మనేపదం భవతి కర్మణీత్యనువర్తతే, 'భావ ఇతి నివృత్తమ్ తతః 'కర్తృవ్యతిహారే కర్తరీత్యేవ కర్మణీతి నివృత్తమ్ (మహాభాష్యము ౧ ౩ .౨ ౧.౨)

రామాయణమున మఱియొకచోఁ గూడ నీ శ్లోకపాదము కలదు

శ్లో॥ కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే
ఏతి జీవన్త మానన్దో, నరం వర్షశతాదపి
(సుందర 3౮ ౬.)

మహాభాష్యకర్తయు మఱియొకచోఁ బైనిచిహ్నితము లగు శ్లోకపాదములు, రెండును నుదాహరించి సాధించి యున్నాఁడు (చూ మహాభాష్యము 3 ౧ ౮ ౬౭). ఇట్లాకటికి రెండు పర్యాయములు మహాభాష్యకర్త రామాయణ ప్రయోగము సాధు వని చెప్పినాఁడు ఇఁక 'రామాయణ ప్రయోగములను మునిత్రయమువారు సాధువు లని సాధింపఁ

దలపెట్ట లే దని శాస్త్రిగా రనుట యెట్టిదియో నా కెఱుఁగ రా కున్నది

రామాయణమునకుఁ దరువాతి మహాకావ్యములలోఁ గల మహాకవిప్రయోగములు సయిత మితఁ డెట్లు సాధించి నాఁడో గమనింపుఁడు

## రావణార్జునీయము

కవి భీమసేనుఁడు కథావస్తువు కార్తవీర్యార్జునుని చరిత్రము. పాణినీయసూత్రములు పై నుదాహరించుచు వానికి లక్ష్యములుగా నీ కావ్యమందలి శ్లోకములు కవిచే వ్రాయఁబడి నవి పాణినీయము కావ్యభాషానుశాసక మనుదృష్టితోఁ గవి యీ కావ్యమును వ్రాసినాఁ డని వేఱుగా నిరూపింప నక్కఱ లేదు శాస్త్రిగా రపాణినీయములని యుదాహరించినవియుఁ బాణినీయసాధ్యములని మనము నిరూపించినవియు నగుప్రయోగములు కొన్ని యీకావ్యములోను గన బడుచున్నవి ఈ కావ్యములోనిదే యీక్రిందిశ్లోకము

> 'ఉదగాత్కఠకాలాపం ప్రత్యష్ఠాత్కఠకౌథుమమ్
> ఏషాం యజ్ఞే ద్విజాతీనాం, తద్విఘాతిభి రన్వితమ్ '
>
> (౭. ౮)

ఈ శ్లోకములోని మొదటిరెండుపాదములను 'అనువాదేచరణానామ్' అనుసూత్రమునకు లక్ష్యములుగా మహాభాష్యకర్త ప్రదర్శించినాఁడు 'అనువాదే చరణానామ్'— ఇహ కస్మా న్న భవతి—నన్దన్తు కఠకాలాపాః, వర్ధన్తాం కఠకౌథుమాః, "స్థేణో"రితి వక్తవ్యమ్, ఏవమపి 'తిష్ఠన్తు కఠకా

లాప' ఇత్యత్రాపి ప్రాప్నోతి, *'అద్యతన్యాంచ' అద్యతన్యాం చేతి వక్తవ్యమ్ "ఉదగాత్కుత కాలాపం ప్రత్యష్ఠాత్కుత కాథుమమ్" (మహాభాష్యము ౨ ౪ ౧. ౩)

జానకీహరణము

ఈ కావ్యమును రచించినవాఁడు కుమారదాసుఁడు. ఉజ్జ్వలదత్తునిచే నీకావ్యమునుండి యనేకోదాహరణము లుణాదిసూత్రవృత్తిలోఁ బ్రదర్శింపఁబడినవి దీనిలోనిదే యీ క్రింది శ్లోకము.

శ్లో. అయి విజహీహి దృఢోపగూహనం
త్యజ నవసఙ్గమభీరు వల్లభమ్
అరుణకరోద్గమ ఏష వర్తతే
వరతను సంప్రవదన్తి కుక్కుటాః॥

ఈ శ్లోక మీకావ్యములోని దని క్షేమేంద్రాదు లౌచిత్యవిచారచర్చాదిలక్షణగ్రంథములలోఁ గూడ నుదాహరించినారు (చూ. ఔచిత్యవిచారచర్చ ౨౧ పొ)

ఇఁక వ్యక్తవాచామ్' అను సూత్రభాష్యమున నీ శ్లోక చతుర్థపాద మెట్లనుకరింపఁబడి సాధింపఁబడినదో తిలకింపుఁడు.

"వ్యక్తవాచాం సముచ్చారణే వ్యక్తవాచామితి కిమర్థమ్ "వరతను సంప్రవదన్తి కుక్కుటాః' వ్యక్తవాచామిత్యుచ్యమానే ప్యత్ర ప్రాప్నోతి ఏతేపి హి వ్యక్తవాచః అతశ్చ వ్యక్తవాచః కుక్కుటేనోదితే ఉచ్యతే కుక్కుటో వదతీతి. ఏవం తర్హి వ్యక్తవాచామిత్యుచ్యతే. సర్వ ఏవ హి వ్యక్త

* అద్యతనీతి లుఙస్సంజ్ఞా' (ఉద్యోతము).

వాచ స్తత్రప్రకర్ష గతి ర్విజ్ఞాస్యతే సాధీయో యే వ్యక్తవాచ ఇతి కే చ సాధీయః యేషాం వాచ్యకారాదయో వర్ణా వ్యజ్యన్తే న చైతేషాం వాచ్యకారాదయో వర్ణా వ్యజ్యన్తే ఏవం హ్యాహుః "కుక్కుటాః కుక్కు"డితి నైవం తే ఆహుః అనుకరణమేతత్తేషామ్ అథవా నైవం విజ్ఞాయతే వ్యక్తా వాగ్యేషాం త ఇమే వ్యక్తవాచ ఇతి, కథం తర్హి వ్యక్తా వాచి వర్ణా యేషాం త ఇమే వ్యక్తవాచ ఇతి" (మహాభాష్యము, ౧ ౩ ౨ ౪౮)

కుక్కుటములు వ్యక్తవాక్కులు గావు గనుకఁ బై సూత్రమున నాత్మనేపదము రాక 'సంప్రవదన్తి' అనుపరస్మైపదము సాధు వైనదని మహాభాష్యకర్త యనుచున్నాఁడు. కుక్కుటములు వ్యక్తవాక్కులా ? కావా ? అని విపులముగాఁ జర్చించి వ్యక్తవాక్కులు గా వని స్థిరపఱచినాఁడు మొత్తము మీఁద నీసూత్రభాష్య మంతయు నీకావ్యప్రయోగవిషయక మగుచర్చతోడనే ముగిసినది పాణినీయము కావ్యభాషాను శాసక మనుటకు మహాభాష్యపఙ్క్తి సాధకమో బాధకమో యిఁకఁ బాఠకులే యూహింపుఁడు

కొందఱు విమర్శకు లీకవులే మహాభాష్యమునుండి పై శ్లోకపాదములను గ్రహించి తమకావ్యములలోఁ జేర్చి కొనినా రనుచున్నారు వీ రైన నీవాదమునకుఁ దగు ప్రమాణములఁ జూపినవారు కారు పరిశోధించిన నీ కావ్యములు ప్రాచీనము లనుటకు సందేహము లేదు ఇప్పటికి సంస్కృతమున జరగిన కావ్యకాలనిర్ణయము గాని కవికాలనిర్ణ

యము గాని సరి యగునది కాదు వీరిపరిశోధనమున నెందఱు కవులో యెన్ని కావ్యములో తాఱుమాఱయినవి A D వారు B C వారుగను, B C వారు A.D వారుగను మాఱినారు అవి యిట్టి వని నిర్ణయింపఁగల ప్రబలప్రమాణములు గలవు. అవి యటుండనిండు మహాభాష్యకర్తనుండి వీ రీపాదములు గ్రహించి ప్రయోగించి రనినను వీరిగ్రంథములనుండి గ్రహించి మహాభాష్యకర్త సాధించినాఁ డనినను 'కావ్యభాష పాణినీయానుశిష్ట మైన' దనియే స్థిరపడును ఒకలక్షణకర్త కావ్యవాఙ్మయమునుండి లక్ష్యములు సంగ్రహించి వ్యాకరణము రచించినాఁడనినను, లక్షణకర్త సాధించినలక్ష్యములు కావ్యకర్తలు గ్రహించి ప్రయోగించినా రనినను ఫలము తుల్యమే గదా

"మనుస్మృతి

'దూరా దావసథాన్మూత్రం దూరా త్పాదావసేచనమ్'.
(४-१५१)

"దూరాన్తికార్థేభ్యో ద్వితీయా చ—వా దూరాన్తికార్థేభ్యః పంచమీవిధానే తద్యుక్తాత్పంచమీప్రతిషేధః. దూరాన్తికార్థేభ్యః పంచమ్యాః ప్రతిషేధో వక్తవ్యః దూరాద్గ్రామస్య నవా తత్రాపి దర్శనా దప్రతిషేధః అనర్థకః ప్రతిషేధోఽప్రతిషేధః నవా తత్రాపి దర్శనాత్పంచమ్యాః ప్రతిషేధోనర్థకః తత్రాపిహి పంచమీ దృశ్యతే. "దూరా"

దావసథాన్మూత్రం దూరాత్పాదావసేచనమ్"* "దూరాచ్చ భావ్యం దస్యుభ్యో దూరాచ్చ కుపితా ద్గురోః.'

(మహాభాష్యము ౨ 3 ౨ 3౫)

పై వార్తికముచే దూరాన్తికార్థములకుఁ బంచమి విధింపఁబడి తత్సన్నిహితము లగుగ్రామాదిశబ్దములకుఁ బ్రతిషేధింపఁబడినది దీనిమూలమున 'గ్రామస్య దూరాత్' అనునర్థమున దూరాద్గ్రామాత్ వంటిప్రయోగము లసాధువు లగుచుండఁగా మహాభాష్యకర్త 'ఆవసథస్య దూరాత్' అనునర్థమున 'దూరాదావసథాన్మూత్రమ్' అను మనుస్మృతి ప్రయోగమును బ్రదర్శించి నవా తత్రాపి దర్శనా దప్రతిషేధః' అనువార్తికమున దూరాదిశబ్దసన్నిహితము లగునావసథాది శబ్దములకును బంచమీప్రయోగము సాధు వనుచున్నాఁడు ఇట్లు స్మృత్యాదులలోనిభాషను సైతము పాణినీయ మనుశాసించి యున్నది

## ఉపతిష్ఠతే-ఉపతిష్ఠతి

"సూ ఉపాన్మంత్రకరణే" వా ఉపాద్దేవపూజాసంగతకరణయోః' ఉపాద్దేవపూజాసంగతకరణయోరితి వక్తవ్యమ్ దేవపూజాయామ్ ఆదిత్యముపతిష్ఠతే చంద్రమసముపతిష్ఠతే

శ్లో బహూనామప్యచిత్తానా, మేకో భవతి చిత్తవాౕ
పశ్య వానరసైన్యేస్మి న్యదర్క ముపతిష్ఠతే ।

---

* "దూరాచ్చ భావ్యం దస్యుభ్యో దూరాచ్చ కుపితాద్గురోః" అను నీరెండుపాదములు మనుస్మృతిలోఁ గనఁబడ లేదు ఏస్మృతినుండి గ్రహించెనో పరిశోధింపవలయును

శ్లో॥ మైవం మంస్థాః సచిత్తోఽయ, మేషోఽపి హి యథా వయమ్
ఏతద ప్యస్య కాపేయం యదర్క ముపతిష్ఠతి॥
(మహాభాష్యము ౧ ౩ ౨ ౨౫)

ఇందలి రెండుశ్లోకములును "ఉపాద్దేవపూజాసంగత కరణయోః అనువార్తికమున కుదాహరణప్రత్యుదాహరణములుగాఁ బతంజలిభగవానునిచేఁ బ్రదర్శింపఁబడినవి 'ఉప' పూర్వక మగు'స్థా' ధాతువునకు దేవపూజాసంగతికరణములఁ జెప్పునప్పు డాత్మనేపదమును తదితరసమయమునఁ బరస్మై పదమును వచ్చు నని పై వార్తికమున కభిప్రాయము మొదటి శ్లోకమునఁ జెప్పఁబడినయాదిత్యోపస్థానము దేవపూజావిషయముగ భావింపఁబడుటచేఁ గవి 'ఉపతిష్ఠతే' యని యాత్మనేపదప్రయోగ మొనర్చినాఁడు రెండవశ్లోకములోని యాదిత్యోపస్థానము చాపల్యమునే సూచించుచున్నది గావున, దేవపూజాసందర్భము కాదని యాత్మనేపదప్రయోగమును మాని 'ఉపతిష్ఠతి' అని పరస్మైపదమునే ప్రయోగించెను పై ప్రయోగములను వార్తికకారుని వార్తికమును బరిశీలించునప్పుడు సహృదయులగు వారి కిట్టిప్రయోగములకొఱకే ప్రధానముగా వార్తికకారుఁ డీవార్తికమును రచించె నని తోఁపకపోదు

"కాలః పచతి భూతాని కాల స్సంహరతి ప్రజాః"

"కాలసమయవేలాసు తుమున్" వా 'ప్రథమాంతేషు' ప్రథమాంతేష్వితి వక్తవ్యమ్ కిం ప్రయోజనమ్ ఇహ మా భూత్ కాలే భుంక్తే త త్తర్హి వక్తవ్యమ్ పై ప్రాదిష్వితి

వర్తతే తచ్చావశ్యం వైౙ్ఞాదిగ్రహణ మనువర్త్యమ్ ప్రథమాం తేష్వితి వ్యాచ్యమానే ఇహాపి ప్రసజ్యేత.

కాలః పచతి భూతాని కాలస్సంహరతి ప్రజాః'

(మహాభాష్యము 3 3 ౨ ౧౬౭)

వైసూత్రమునఁ బైౙ్ఞాదిగ్రహణానువృత్తికిఁ బ్రయోజనము 'కాలస్సంహరతి కాలఃపచతి' అను మహాకవిప్రయోగముల సాధన మఁట

' శంఖదుందుభివీణానామ్ '

2 ''మృదంగశంఖతూణవాః పృథ క్నదంతి సంసది'

3 ప్రాసాదే ధనపతిరామ కేశవానామ్'

''అల్పాచ్‌తరం' కిమయం తంత్రం తరనిర్దేశః

ఆహోస్విదతంత్రమ్ యది తంత్రం ద్వయో

ర్నియమో బహుష్వనియమః తత్ర కో దోషః

శంఖదుందుభివీణానా మితి న సిద్ధ్యతి

దుందుభిశబ్దస్యాపి పూర్వనిపాతః ప్రాప్నోతి

అథాతంత్రమ్ ''మృదంగశంఖతూణవాః

పృథక్నదంతి సంసది'' 'ప్రాసాదే ధనపతి

రామకేశవానామ్' ఇత్యేతన్న సిద్ధ్యతి

యదీచ్ఛసి తథాస్తు అస్తుతావత్తన్త్రమ్ నను చోక్తమ్ ద్వయో ర్నియమో బహు ష్వనియమ ఇతి తత్ర ''శంఖదుందుభివీణానా''మితి న సిద్ధ్యతి దుందుభి శబ్దస్యాపి పూర్వనిపాతః ప్రాప్నో తీతి నైష దోషః యదేత దల్పాచ్ తర' మితి తదల్పాజితి వక్ష్యామి అథవా పునర స్త్వతన్త్రమ్.

నను చోక్తమ్ - "మృదఙ్గశఙ్ఖతూణవాః పృథఙ్నదన్తి సంసది"
"ప్రాసాదే ధనపతిరామకేశవానామ్ ఇత్యేతన్న సిద్ధ్యతీతి
'అతన్త్రే తరనిర్దేశే శఙ్ఖతూణవయో ర్మృదఙ్గేన సమాసః
అతన్త్రే తరనిర్దేశే శఙ్ఖతూణవయోర్మృదఙ్గేన సహ సమాసః
కరిష్యతే, శఙ్ఖశ్చ తూణవశ్చ శఙ్ఖతూణవౌ, మృదఙ్గశ్చ శఙ్ఖ
తూణవౌచ మృదఙ్గశఙ్ఖతూణవాః రామశ్చ కేశవశ్చ రామ
కేశవౌ ధనపతిశ్చ రామకేశవౌచ ధనపతిరామకేశవాః, తే
షాం ధనపతిరామకేశవానామితి '

(మహాభాష్యము ౨ ౨ ౨ ౩౮)

ఇంత విపులముగా విమర్శించి విగ్రహప్రదర్శనముతోఁ
బై మహాకవిప్రయోగముల నరమర లేక సాధించు చున్న
మహాభాష్యము 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'
దని యే యనుచున్నదా ?

"వాతాయ కపిలా విద్యు దాతపాయాతిలోహినీ
కృష్ణా సర్వవినాశాయ దుర్భిక్షాయ సితా భవేత్ ॥"

"ఉత్పాతేన జ్ఞాప్యమానే ఉత్పాతేన జ్ఞాప్యమానే
చతుర్థీ వక్తవ్యా "వాతాయ కపిలా విద్యు దాతపాయాతి
లోహినీ కృష్ణా సర్వవినాశాయ దుర్భిక్షాయ సితా భవేత్"
(మహాభాష్యము ౨ ౩ ౧ ౧౩)

వాతాయ, ఆతపాయ' మొదలగువానిలోని చతుర్థీ
విభక్తి "ఉత్పాతేన జ్ఞాప్యమానే' అను వార్తికమున సాధు
వగుచున్న దని మహాభాష్యకర్త యనుచున్నాఁడు

"ఉపస్నాతం స్థాలసిక్తం, తూష్ణీంగఙ్గం మహాహ్రదమ్
ద్రోణం చే దశకో గన్తుం, మా త్వా తాప్తాం కృతాకృతే

"చార్థే ద్వన్ద్వః శేష ఇతి వర్తతే యది శేష ఇతి వర్తతే, "ఉపస్నాతం స్థాలసిక్తం తూష్ణీంగఙ్గం మహాహ్రదమ్ ద్రోణం చే దశకో గన్తుం మా త్వా తాప్తాం కృతాకృతే" ఇత్యేతన్న సిద్ధ్యతి, నైషదోషః అన్యద్ధి కృత మన్యద కృతమ్' (మహాభాష్యము ౨ ౨ ౨ ౨౯)

ఉపస్నాతాదులు పంచతీర్థములు తీర్థస్నానప్రశంసాపర మీ శ్లోకము చార్థే ద్వన్ద్వః' అను సూత్రములోనికి శేషగ్రహణానువృత్తియే యున్నఁ బై శ్లోకములోని "కృతాకృతే" అను ప్రయోగము కుదురదని యాశంకించి సమానాధికరణసమాస మిది కాకపోవుటచే బాధ లే దనుచున్నాఁడు పతంజలిభగవానుఁడు.

1 "శయానా వర్ధతే దూర్వా'
2 "ఆసీనం వర్ధతే బిసమ్ '

"సో లక్షణహేత్వోః క్రియాయాః వా తత్త్వాన్వాఖ్యానేచ తత్త్వాన్వాఖ్యానే చోపసంఖ్యానం కర్తవ్యమ్ 'శయానా వర్ధతే దూర్వా" "ఆసీనం వర్ధతే బిసమ్" (మహాభాష్యము 3 ౨ ౨ ౧౨౬)

"తత్త్వాన్వాఖ్యానే చ' అను వార్తికమునకుఁ బై రెండుపాదములు నుదాహరణములుగా నొసఁగి సాధించినాఁడు

'త్రీణి యస్యావదాతాని
విద్యా యోనిశ్చ కర్మచ
ఏతచ్ఛివే విజానీహి
బ్రాహ్మణాగ్ర్యస్య లక్షణమ్"

"సూ 'పుంయోగాదాఖ్యాయామ్ వా అవదాతా యాం జీష్ప్రసజ్గః అవదాతాయాం తు జీష్ ప్రాప్నోతి అవదాతా బ్రాహ్మణీ. "వర్ణాదనుదాత్తాత్తోపధాత్తోనః' ఇతి నైష వర్ణవాచీ కిం తర్హి విశుద్ధవాచీ అతశ్చ విశుద్ధవాచీ. ఏవం హ్యాహ 'త్రీణి యస్యావదాతాని విద్యా యోనిశ్చ కర్మచ ఏతచ్ఛివే విజానీహి, బ్రాహ్మణాగ్ర్యస్య లక్షణమ్" (మహాభాష్యము ౪ ౧ ౨ ౪౫)

పై పురాణశ్లోకమునుబట్టి "అవదాతశబ్దము' విశుద్ధ వాచకము గలదని 'అవదాతా (బ్రాహ్మణీ) అను ప్రయోగమున జీష్ప్రత్యయము రా దని వారించుచున్నాడు

"క్షేమే సుభిక్షే కృతసంచయాని
పురాణి రాజ్ఞాం వినయన్తి కోపమ్"

"సూ సమాసాంతాః వా లిఙ్గమశిష్యం లోకాశ్ర యత్వాల్లిఙ్గస్య ఇదం తర్హి ప్రయోజనమ్ ద్విపురీ, త్రిపురీ ద్విగోరకారాన్తా దితీకారో యథా స్యాత్. ఏతదపి నాస్తి ప్రయోజనమ్ పురశబ్దోఽయ మకారాన్త స్తేన సమాసో భవిష్యతి అతశ్చాకారాన్తః ఏవం హ్యాహ-' క్షేమేసుభిక్షే కృత సంచయాని పురాణి రాజ్ఞాం వినయన్తి కోపమ్ ఇతి" (మహాభాష్యము ౫ ౪ ౧ ౬౫)

పురశబ్ద మకారాన్త మనుట కీ కావ్యప్రయోగ మును బ్రమాణముగాఁ బ్రదర్శించుచున్నాఁడు

'ప్రస్థే హిమవత శ్శృఙ్గే'

'సూ. గ్రహవృదృనిశ్చిగమశ్చ వా ఘఞర్థే కవిధా సంస్థానస్నా పావ్యధిహానియుధ్యర్థమ్ ఘఞర్థే కో విధేయః కిం ప్రయోజనమ్ స్థానాస్నావ్యధిహానియుధ్యర్థమ్ స్థా-ప్రతిష్ఠన్తే ఽస్మిన్ ధాన్యానీతి ప్రస్థః-"ప్రస్థే హిమవత శ్శృఙ్గే (మహా భాష్యము 3 3 ౧ ౫౮)

పై వార్తికమునకు లక్ష్య మీ మహాకవిప్రయోగ మనుచున్నాఁడు

"గౌరివాకృతనీశారః, ప్రాయేణ శిశిరే కృశః"

సూ. ఇజశ్చ వా శౄ వాయువర్ణ నివృతేషు శౄఇత్యేతస్మాద్వాయువర్ణనివృతేషు ఘఞ్ వక్తవ్యః శారో వాయుః, శారో వర్ణః "గౌరివాకృతనీశారః ప్రాయేణ శిశిరే కృశః" (మహాభాష్యము 3 3 ౧ ౨౧)

'శౄ' ధాతువున కాచ్ఛాదనార్థమున 'ఘఞ్' ప్రత్యయము విధించి శారశబ్దమును సాధించి పై ప్రయోగములోని "అకృతనీశారః' అనుదానికి "అకృతాచ్ఛాదనః" అని యర్థ మనుచున్నాఁడు

1 'అసిద్వితీయోఽనుససార పాణ్డవమ్"

2 "సంకర్షణద్వితీయస్య బలం కృష్ణస్య వర్ధతామ్"

"సూ. అనేకమన్యపదార్థే వా అవయవేన విగ్రహా స్సముదాయస్సమాసార్థః యద్యవయవేన విగ్రహస్సముదా

యస్సమాసార్థః "అసిద్వితీయోఽనుససార పాండవమ్" "సంకర్షణద్వితీయస్య బలం కృష్ణస్య వర్ధతామ్" ఇతి ద్వయోర్ద్వివచనమితి ద్వివచనం ప్రాప్నోతి నైషదోషః అయం ద్వితీయాశబ్దోఽస్త్యేవ పూరణే వర్తతే అస్తి సహాయవాచీ. తద్యస్సహాయవాచీ తస్యేదం గ్రహణమ్ అసిద్వితీయః అసిసహాయ ఇతి గమ్యతే' (మహాభాష్యము ౨ ౧ ౨ ౨౪)

"అసిద్వితీయః' సంకర్షణద్వితీయస్య"—అను వైప్రయోగములలో ద్వితీయశబ్దము సహాయవాచక మనివ్యాఖ్యానించినాఁడు

"జనార్దనస్త్వాత్మచతుర్థ ఏవ '

"సూ అజ్ఞాయినిచ కథం "జనార్దనస్త్వాత్మచతుర్థఏ' వేతి బహువ్రీహిరయమ్ ఆత్మాచతుర్థోఽస్యేతి' (మహాభాష్యము ౬ ౩ ౧ ౫)

'ఆత్మనశ్చ" అను సూత్రమునఁ దృతీయావిభక్తికి అలుక్కు వచ్చి 'ఆత్మనా చతుర్థః" అని కావలసి యుండ 'ఆత్మచతుర్థః' అను మహాకవిప్రయోగ మెట్లు సాధు వని ప్రశ్నించి "ఆత్మాచతుర్థోఽస్య' అను విగ్రహముచే బహువ్రీహి సమాసము గావున నలుక్కురా లేదని సాధువనుచున్నాఁడు

"తుతోజ శబలాఀ హరీన్."

"సూ తుజాదీనాం దీర్ఘోఽభ్యాసస్య—వా తుజాదిషుచ్ఛన్దః ప్రత్యయగ్రహణం వక్తవ్యమ్ ఛన్దసి తుజాదీనాం దీర్ఘో భవతీతి వక్తవ్యమ్ అస్మిం శ్చాస్మింశ్చప్రత్యయ ఇతి వక్త

వ్యమ్, ఇహ మా భూత్—"తుతో౽జ శబలాన్ హరీన్" (మహాభాష్యము ౬ ౧ ౧ ౭)

వింటిరా మహాభాష్య మే మనుచున్నదో "తుతో౽జ శబలా౯హరీన్ అనుమహాకవిప్రయోగము కుదురుపడుటకు "తుజాదీనాం దీర్ఘో౽భ్యాసస్య" అనుసూత్రమున ఛందోగ్రహణ మావశ్యక మనుచున్నది

'ఆత్మమ్భరి శ్చరతి యూథ మసేవమానః"

ఈ మహాకవిప్రయోగము "భృఞః కుక్ష్యాత్మనోర్ముమ్ చ'-అను వార్తికమున కుదాహరణముగా మహాభాష్యమునఁ బ్రదర్శింప బడినది (చూ సూ 'ఫలేగ్రహిరాత్మమ్భరిశ్చ' మహాభాష్యము ౩ ౨ ౧ ౨౬)

"ఇహైవ భవ మా స్మ గాః'
"అత్రైవ త్వమిహ వయం సు శేవాః

మహాభాష్యకర్త 'ఏవే చానియోగే' అను వార్తికములోని "అనియోగే గ్రహణము పై మహాకవిప్రయోగములలోని "ఇహైవ-అత్రైవ' అనువానికి సాధుత్వము నుపదేశించుటకే యనుచున్నాఁడు

'సూ ఏఙి పరరూపమ్—వా ఏవే చానియోగే ఏవే చానియోగే పరరూపం వక్తవ్యమ్ ఇహ+ఏవ - ఇహేవ అద్యేవ అనియోగ ఇతి కిమర్థమ్? 'ఇహైవ భవ మా స్మగాః' "అత్రైవ త్వమిహ వయం సు శేవాః" (మహాభాష్యము ౬. ౧ ౪. ౯౪)

"జఘాన కంసం కిల వాసుదేవః"

"సూ. అనద్యతనే లఙ్—వా. 'పరోక్షే చ లోకవిజ్ఞాతే ప్రయోక్తుర్దర్శనవిషయే' పరోక్షే చ లోకవిజ్ఞాతే ప్రయోక్తుర్దర్శనవిషయే లఙ్ వక్తవ్యః అరుణద్యవనస్సాకేతమ్ అరుణ ద్యవనో మధ్యమికామ్ పరోక్ష ఇతి కిమర్థమ్ ఉదగాదాదిత్యః లోకవిజ్ఞాత ఇతి కిమర్థమ్, చకార కటం దేవదత్తః ప్రయోక్తుర్దర్శనవిషయ ఇతి కిమర్థమ్ 'జఘాన కంసంకిల వాసుదేవః (మహాభాష్యము 3 ౨. ౨ ౧౧౧)

పై మహాకవిప్రయోగమునఁ ప్రయోక్తకుఁ గంసవధము దర్శనవిషయము కానందునఁ బై వార్తికముచొప్పున 'లఙ్' ప్రయోగ మనుపపన్నమై "పరోక్షే లిట్" అను సూత్రమున లిట్' ప్రయోగ మేర్పడినదని మహాభాష్య మనుచున్నది

"ప్రథతే త్వయా పతిమతీ పృథివీ'

'సూ అంతర్వత్పతివతోర్నుక్—వా 'అన్తర్వత్పతివదితిగర్భభర్తృసంయోగే-అన్తర్వత్పతివదితి గర్భభర్తృసంయోగ ఇతి వక్తవ్యమ్ ఇహమా భూత్-"ప్రథతే త్వయా పతిమతీ పృథి వీతి" (మహాభాష్యము, ౪ ౧ ౨ ౩౨)

పై వార్తికమున భర్తృసంయోగే, అనునది లేకున్నఁ బై మహాకవిప్రయోగము - భర్తృసంయోగము లేనిసందర్భములోని 'పతిమతీ' అనునది-యసాధు వగును కావున, భర్తృసంయోగమున 'పతివతీ' అనునది సాధు వనియు భర్తృసంయోగము లేనిసందర్భమున "పతిమతీ" అనునదియే సాధు

వనియు బోధించుచుఁ బై మహాకవిప్రయోగము సాధు వను టకు వార్తికమున "భర్తృసంయోగే' అనునది యావశ్యక మని మహాభాష్యకర్త యనుచున్నాఁడు

ఇట్లు మహాకవిప్రయోగము లనేకములు మహాభాష్య మున సాధింపఁబడి యున్నవి. గ్రంథ మధికముగాఁ బెరిఁగి వను నీమహాకవిప్రయోగముల సాధించినమహాభాష్యఫక్కి యెట్టిదియో పాఠకలోకము గుర్తెఱుఁగుటకు మహాభాష్య పంక్తులు సయితము వీ లగునంతవఱకు నుదాహరించితిని. 'ఈమహాభాష్యఫక్కి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనువిపరీతనిశ్చయము గలిగించుచున్న'దని శ్రీశాస్త్రిగా రనినారు. పాఠకులారా యీసందర్భమున నాయుదాహరిం చిన మహాభాష్యభాగముల నెల్ల సమగ్రముగా నవలోకించిన మీ కిప్పు డట్టినిశ్చయమే కలిగినదా? ఏయొకకవిప్రయోగ మునో మహాభాష్యకర్త 'ఛాందసత్వాద్భవిష్యతి' అని ప్రమాద మనినంతమాత్రమునఁ బాణినీయము కావ్యభాషాను శాసకము కాకపోవునా? సాధుశబ్దములనుండి యపశబ్దము లను వేఱుపఱచుట వ్యాకరణకర్తలకృత్యములలో నొకటి. అట్టికృత్యమున శాస్త్రకర్తలు జాగరూకత వహించినప్పు డది 'పాణినీయము కావ్యభాషానుశాసక' మని నిరూపింపఁ గలు గునే గాని కా దనువిపరీతనిశ్చయము కలిగింప లేదు ఒకవేళ 'ఛాందసత్వాద్భవిష్యతి' అనుభాష్యమును బట్టి శ్రీశాస్త్రిగారు నిర్ణయించిన 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'దను వాదమునే మనము నంగీకరింపఁ దలచినను బై రీతిని జర్చా పూర్వకముగా ననేకమహాకవిప్రయోగముల సాధించిన ఫలం

జలిభగవానుఁ డంగీకరింపఁడు కావున నేవిధముగాఁ జూచి నను శ్రీశాస్త్రిగారి వాదము దుర్బల మని యంగీకరింపక తప్పదు.

---

## 'పుపుతి త్రీయియిషిషతి' సాధనము—పాణినీయము భాష-వ్యాకరణము

ఈ విషయమున శ్రీశాస్త్రిగా రిట్లు వ్రాసినారు "భారతరామాయణాదులలోని పరశ్శతప్రయోగములు పాణి నీయ సమ్మతములు కాకుండుటచేతను బాణినీయ సాధ్య ములగు 'పుపుతి త్రీయియిషిషతి' మున్నగు వానివంటి యనేక రూపములు రామాయణాదులలో లేకుండుటచేతను బాణినీ యమునకును భారత రామాయణాది భాషకును నట్టి సంబం ధ మున్నదనెడువాదము నిలువనేరదు .. భారత రామాయ ణాది గ్రంథముల భాషకే పాణినీయ మన్వాఖ్యాన మని యంగీ కరించునపు డట్టిగ్రంథములలోని ప్రయోగముల నయ్యాది యన్వాఖ్యానాతిరిక్తముగా సంబంధించి యుండవలెను" (అను బంధము ౫ పు)

పాణినీయసాధ్యములు గాని భారత రామాయణాదుల లోని ప్రయోగము లేవియో శ్రీశాస్త్రిగా రుదాహరింపలేదు. ఉదాహరించిన పంచపాండవులు మున్నగు ప్రయోగముల విషయమున శ్రీశాస్త్రిగారే పొరపడి రనియు, నవి పాణినీయ సాధితములే యనియు 'మహాకవి ప్రయోగసాధన' మను ప్రకరణమున నిరూపించియున్నాను ఇఁక నార్ష పయోగము

లేవేని యున్నవందురా 'ఛాందసత్వా ద్భవిష్యతి' యనురీతిని బతంజలిభగవానుఁడు వానికి మార్గమేర్పఱచియే యున్నాఁడు అనుశాసింపఁదలఁచిన భాషకు వ్యాకరణ మన్యూనానతి రిక్తముగా నుండవలయు'నను శ్రీశాస్త్రిగారి వాదము నంగీకరించినను గేవల భారతాది వాఙ్మయముకొఱకే పాణినీయము రచింపఁబడిన నట్టిది సంభవింపవచ్చును అది యట్టిది కాదు "సర్వవేదపారిషదం హీదం శాస్త్రమ్' అని మహాభాష్యకర్త చెప్పినట్లు సకల వైదికవాఙ్మయమును 'సప్తద్వీపా వసుమతీ త్రయో లోకాః వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యకమ్" అనురీతి నాతడే పరిగణన మొనర్చి చూపిన లౌకిక వాఙ్మయమును ననుశాసించినది ఈనాఁడు వైదిక వాఙ్మయమున బాహ్వృచాదులలో నొక్కశాఖ యైనను నమగ్రముగా లభింపకున్నది లౌకికవాఙ్మయమున నైనను 'సప్తద్వీపా వసుమతీ' యని యతఁ డుదాహరించెను సప్తద్వీపములలోని భాషమాట యటుండ సప్తద్వీపములలోని యొక్కద్వీపము నైనను శ్రీశాస్త్రిగారు చూడలేదు తుద కిప్పటికిని సంస్కృతమునకుఁ బేరువడియున్న నేపాళ కాశ్మీరాది దేశములనైన వీరు చూచియుండరే ఏ యేదేశమున నెట్టి శబ్ద లెట్టి వ్యవహారమునఁ గలవో, యెంత వాఙ్మయ మెక్కడ నెక్కడ డిగఁబడియున్నదియో, శిథిలమై పోయిన వాఙ్మయ మెంత కలదో వీరి కెట్లు తెలియును? నామముల సైతము సాధించి పాణిని స్పష్టముగాఁ బేర్కొనిన 'శిశుక్రందీయము సీతాన్వేషణీయము' మొదలగు గ్రంథములే మన కిప్పు డుపలబ్ధము లగుట లేదు

## సంస్కృతము - భిన్నదేశవ్యవహారము

భిన్నభిన్న దేశ వ్యవహారము గల శబ్దభేదముల నన్నిటినీ జాగరూకతతో గమనించి పాణినీయ మను శాసించి యున్నదనీ పతంజలిభగవానుఁ డెట్లు చెప్పియున్నాఁడో పరికింపుఁడు "శవతిర్గతికర్మా దాత్రమమనీ ఝ్వేషు" *(మహాభాష్యము ౧ ౧ ౧) శవశబ్దము శవధాతువునుండి యేర్పడినది దీనికి మృతప్రాణి యర్థ మని మన మనుచున్నాము పాణిని తన ధాతుపాఠమున 'శవ-గతౌ' అని గత్యర్థమును నిర్దేశించియున్నాఁడు ఈగత్యర్థకమగు శవధాతువునుండి కలిగిన శవశబ్దమునకు 'గమనకర్త (వెళ్లువాఁడు)' అనియర్థము ఈశబ్ద మీయర్థమునఁ గంభోజదేశమునఁ గలదని పై మహాభాష్య మనుచున్నది పతంజలి యీ విషయము మనకుఁ దెలుపనినాఁడు మన వ్యవహారమునుబట్టి శవధాతువునకుఁ బాణిని చెప్పినగత్యర్థము త ప్పని యే మనము నిర్ణయింతుము గదా! ఇట్లే సురాష్ట్రదేశమున 'హమ్మతి' అను శబ్దము గత్యర్థమున వ్యవహరింపఁబడు చున్నదనియు, నీశబ్దమే 'రంహతి'యను రూపముతోఁ బ్రాచ్యమధ్య వ్యవహారమునఁ బ్రసిద్ధిఁ జెందియున్న దనియు మహాభాష్యకర్త చెప్పినాఁడు పాణిని యీ రెండురూపములను వారివారి వ్యవహారముల కనుగుణముగా గ్రహించినాఁడు. ఇట్లే దాత్రాదిశబ్దములకును భిన్న

---

* ఈ మహాభాష్యము సమగ్రముగా 'పాణినీయపరిశోధనము'లోని సంస్కృతము సర్వజనవ్యవహారోపయోగిభాష' అను శిరము క్రింద నుదాహరింపఁబడినది.

భిన్న దేశములలో భిన్న భిన్న వ్యవహారము కలదని చూపి, పాణినీయముచే నిట్టివి సైతము జాగరూకతతో ననుశాసింపఁబడిన వని యతఁడే మనకు విశదీకరించియున్నాఁడు ప్రామాణికశిరోమణి యగు నొకలక్షణకర్త మూలక్షణమునకు లక్ష్యవాఙ్మయ మిది యని శృంగగ్రాహితతో నిర్దేశించి చూపుటయే గాక లక్ష్యలక్షణములకుఁ గల పరస్పరసంబంధమును హస్తనిర్దేశములో నిరూపించి చెప్పుచున్న ను మనకుఁ బ్రమాణము కానప్పు డిఁకఁ బ్రమాణము కాఁదగిన దేది ?

## 'వాకోవాక్య' భాష్యము లక్ష్యవాఙ్మయప్రదర్శకము

"ఒకశబ్దమును గ్రుతక మనవలసినప్పుడు పతంజలి యుదాహరించిన పై వాఙ్మయమునంతను బరిశోధింపవలసిన' దని శ్రీ శాస్త్రిగారీ భాష్యమునకుఁ దాత్పర్యమును వర్ణింపఁ జూచినారు కాని పూర్వాపరసందర్భములను బరిశీలించునప్పు డీ భాష్యమున కిట్టిప్రసక్తియే కాన్పింపదు ఇక్కడివాదోపవాదము లైనను నీ భాష్య మిట్టియర్థమునఁ బ్రమాణ మనుట లేదు పతంజలి యిటుఁ జూపిన వాఙ్మయమున "చత్వారో వేదా స్సాంగా స్సరహస్యా బహుధా భిన్నా ఏకశత మధ్వర్యుశాఖా స్సహస్రవర్త్మా సామవేదః ఏకవింశతిధా బాహ్వృచ్యం నవధాఽఽథర్వణో వేదః" (మహాభాష్యము ౧ ౧ ౧) అని వైదికవాఙ్మయము సైత ముదాహరింపఁబడియున్నది "వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యకమ్" అనురీతిని బతంజలి ప్రదర్శించిన లౌకికవాఙ్మయమునకుఁ బాణినీయ మనుశాసకము కాదని శ్రీ శాస్త్రిగా రీభాష్యమును సమన్వయించి

నప్పుడు వైదికవాఙ్మయమునకుఁగూడ నట్లే యిది యనుశాసకము కాదుగదా ఇట్లైనచోఁ గావ్యభాషానుశాసక మగు వ్యాకరణముతోపాటు వైదికవాఙ్మయానుశాసక మగు వ్యాకరణముగూడ రచింపఁబడవలసినదేగదా శాస్త్రిగారిది యంగీకరింతురేమో గాని పతంజలిభగవానుఁడు మాత్ర మంగీకరింప నన్నాఁడు కావుననే "సర్వవేదపారిషదం, హీదం శాస్త్రమ్" అని యఖిలవైదికవాఙ్మయమును బాణినీయ మనుశాసించిన దని యెలుఁగెత్తి చాటినాఁడు ఇప్పటికైనను దమ భాష్యతాత్పర్యవర్ణనము సరియైనది కాదని శ్రీ శాస్త్రిగారంగీకరింపరా ?

## 'వాకోవాక్య'భాష్యము - కావ్యప్రసక్తి

ఈ మహాభాష్యమునఁ గావ్యప్రసక్తియే లేకపోఁగా దీనినిబట్టియే "కావ్యేతిహాస పురాణాది సకల వాఙ్మయమునకును బాణినీయ మనుశాసకమే" యని నేను 'పాణినీయము-కావ్యభాష'అను నావ్యాసములో (పాణినీయపరిశోధనములో) వ్రాయుట వింతగా నున్నదని శ్రీ శాస్త్రిగా రనినారు కాని హరదత్తాదు లీసందర్భమున నితిహాసాదులతోపాటు కావ్యములనుగూడ స్పష్టముగాఁ జేర్చి పదమంజర్యాదులలో వ్యాఖ్యానించినారు కావున దానికై వారంత వింతపడవలసినయవసరము లేదు మఱియు నితిహాసాదులు స్పష్టముగా నుదాహరింపఁబడినవిగదా ! వానిగతియేమని శ్రీశాస్త్రిగారిని మనముగూడ నడుగుదము

## వ్యాకరణము ప్రయుక్తసాధుశబ్దానుశాసకము

ఈ సందర్భముననె యనుబంధములోని మఱియొక విషయమునుగూడ మనము పరామర్శింతము "ప్రయుక్తానా మేవేదమన్వాఖ్యానమ్"—అను సిద్ధాంతముచొప్పున నేవేని ప్రయోగములకు వ్యాకరణ మన్వాఖ్యాన మనకతీరదుగద (అనుబంధము ౫ పొ) అని శ్రీ శాస్త్రిగా రనుచున్నారు. వ్యాకరణము ప్రయుక్తశబ్దమూలక మని యందఱు నంగీకరింతురు కాని యాప్రయుక్తశబ్దములు సాధువులేవైయుండవల యుననుట మాత్రము శ్రీ శాస్త్రిగా రెఱుఁగవలసిన విషయము అపశబ్దములను సాధువు లని వ్యాకరణ మెన్నఁడును సాధింపదు

## పాణినీయము-వైదికకర్మప్రయోగి భాషానుశాసకము కాదు

ఇక్కడనే మఱియొక విషయమునుగూడ విమర్శింతము. "వైదికకర్మములలో ననేకులుగూడి యనేక విషయములలోఁ జేసెడి వివిధప్రసంగములలో దుర్యోధనాదిశబ్దములకుఁ బ్రసక్తి కలుగవచ్చును గనుక నట్టివానిని బాణినీయము సాధించినది" (అనుబంధము ౮ పొ) అని శ్రీ శాస్త్రిగారు తమవాదమును సమర్థించుకొనయత్నించుచున్నారు కాని వైదికకర్మములలో వైదికులపఠించిన మాత్రము నెఱవేర్పవలసిన కృత్యము లనేకములు గలవు వీనికనవసరప్రసంగముల కవకాశము లేదు ఇదిగాక "శ్వపాక, చండాల" ప్రభృతిశబ్దము లనేకములు పాణినీయముచే సాధింపఁబడుచున్నవి. అట్టి శబ్దముల యుచ్చా

రణము సైతము వైదికకర్మములలోఁ బ్రత్యవాయజనకమని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచున్నవి అట్టిచోఁ బాణినీయ మా శబ్దముల ననుశాసించుటకు హేతు వేమి? వేదములలోని చండాలాదిశబ్దములనే పాణినీయము సాధించిన దని శ్రీ శాస్త్రి గారు సమాధానము చెప్పఁదలఁతురేమో యదివీలు కాదు పాణినిచే లోకవేదసాధారణములుగానే యీశబ్దము లనుశా సింపఁబడినవి కనుకఁ బాణినీయము శిష్టవ్యవహారభాషాను శాసక మనుట యుక్తియుక్తము గాదు ఇఁకఁ బ్రకృత మనున రింతము "ఒకశబ్దము ప్రయుక్తమా? అప్రయుక్తమా? అనఁగాఁ గృతకమా? యకృతకమా? యనువివాదము కల్గున పుడు పురాణేతిహాసాదులభాషతోపాటు శిష్టజన నిత్యవ్యవహా రస్థభాషను సైతము పరిశీలింపవలసియుండునని భాష్యకర్త చెప్పుట సంభవించెను కావుననే "సప్తద్వీపా వసుమతీ త్రయో లోకాః "అని యాతఁడు శబ్దప్రయోగ విషయమును జూపిన వాఁ డయ్యెను' (అనుబంధము ౧౦ పే) అని శ్రీశాస్త్రిగారే వ్రాసినారుగదా ఇట్టిచోఁ బతంజలి యుదాహరించిన వాఙ్మయ ములోని యేకదేశమునైనను బరిశోధింపకయే 'పుపులిత్రియి యిషిషతి' మున్నగు పాణినీయసాధిత శబ్దములు కృతకములని శ్రీశాస్త్రిగా రెట్లు వ్రాయసాహసించిరి? సకల వాఙ్మయమును బరిశోధింపకయే తత్తచ్ఛబ్దములు కృతకము లనఁగూడ దనియే గదా "ఏతావంతం శబ్దస్య ప్రయోగవిషయ మననునిశమ్య సన్త్యప్రయుక్తా ఇతి వచనం కేవలం సాహసమాత్రమేవ" (మహాభాష్యము పస్పశాహ్నికము) అని మహాభాష్యకర్త మందలించినాఁడు పాణినీయము వైదికకర్మోపయోగిశిష్ట

వ్యవహారభాషానుశాసకమనియే గదా శ్రీశాస్త్రిగారు సిద్ధాంతీకరించినది అప్పుడు 'పుపుతిత్రీయియిషిషతి' మున్నగు రూపములును,

శ్లో॥ గవాక్ఛబ్దస్య రూపాణి, క్లీబేఽర్చా గతిభేదతః
అసంధ్య వఙ్పూర్వ రూపై, ర్నవాధికశతం మతమ్॥ ...
శ్లో॥ ఊహ్యామేషాం ద్విర్వచ, నానునాసికవికల్పనాత్
రూపా ణ్యశ్వాతిభూతాని (౫_౨౭), భవ న్తీతి మనీషిభిః॥
(సిద్ధాంతకౌముది)

అని "గవాఙ్‌ఙ్ గోఽఙ్‌ఙ్, గోఙ్‌ఙ్. ,గవాఙ్‌ఙ్ భ్య్యామ్మ్ .." అను రీతిని గవాక్ఛబ్దాదులకు వైయాకరణప్రతిభావిశేష స్ఫోరకములుగా సిద్ధించిన (౫_౨౭ రూపములవంటి) పాణినీయసాధితరూపములన్నియు వైదికకరోన్మపయోగిశిష్టవ్యవహారభాషలో నున్నవని శ్రీ శాస్త్రిగా రంగీకరింపక తప్పదుగదా అట్లు స్వల్పమగు నీభాషలోనే యీ రూపము లన్నియుఁ గలవని మీ రంగీకరించినప్పుడు, పతంజలి యుదాహరించిన యనంత మగు నా వాఙ్మయములో "పుపుతిత్రీయియిషిషతి" వంటిరూపములు లేవనియనుట కెవరేని సాహసింపఁ గలరా?

ఇదియేగాక 'వ్యాకరణ మనునది యన్వ్యానానతిరిక్తముగా నుండవలె' నని పైని వ్రాసిన శ్రీ శాస్త్రిగారే "ఇఁకఁ బాణినీయము కృతకశబ్దముల సాధించునా. యన్ని సందేహింప నక్కఱలేదు. వ్యాకరణమాత్రమున కట్టియతిచార ముండి తీరును" (అనుబంధము ౧౦ పే.) అని మరలఁ దద్విరుద్ధ

ముగా ననుబంధముననే వ్రాసియున్నారు. 'వ్యాకరణమాత్ర మున కట్టియతిచారము తప్పనిచో—రామాయణాదులనేయా ధారముగాఁ జేసికొని రచింపఁబడినను—పాణినీయము "పుపు తిత్రీయియిషిషతి' వంటిరూపముల సాధించుట కభ్యంతర మేమి గలదు ?

కావునఁ 'బుపుతిత్రీయియిషిషతి' రూపసాధనముచే రామాయణాదుల భాషకుఁ బాణినీయ మనుశాసకము గాదను శ్రీ శాస్త్రిగారివాదము నిలువనేరదని వేఱుగా నిరూపింప నక్కఱలేదు.

---

## చిత్రము

"మహాకావ్యములను సాకల్యముగ మూలముఁ జేసి కొని సంపూర్ణమగు మహాకావ్యభాషాస్వరూప ప్రదర్శనోప యోగి సంస్కృత వ్యాకరణపురచన మావశ్యకమై యున్న దని నాచెప్పుటలో శాస్త్రులుగా రనుకొనినట్లు లోకమేల యాశ్చర్యపడవలసి యున్నదో తెలియకున్నది" (అనుబంధము. ౮ పు.) అని శ్రీ శాస్త్రిగారు వ్రాసినారు ఇఁక లోకమేల శ్రీ శాస్త్రిగారి వాదమున కాశ్చర్యపడవలసి యున్నదో నిరూ పింతము దీనికి ముందు మూలగ్రంథములోని వ్రాఁతలుగూడ నొకింత పరికింతము.

"శ్రౌతస్మార్త కర్మములు పుణ్యసంపాదకము లగుటం జేసి యట్టి పుణ్యము సుశబ్దోపయోగపూర్వక కర్మాచరణము వల్లనే లభింపఁగలదనియు నపశబ్దోచ్చారణమున నట్టి పుణ్యము

లభింపనేరదనియు నక్కారణమున వైదికకర్మాచరణమునం దప్పం దక్కినచోట్ల నపశబ్ద ప్రయోగము దుష్టముకాదనియు మహాభాష్యకర్త 'సమానాయాం.. యాజ్ఞేకర్మణి పునర్నాప భాష న్తే' (మహాభాష్యము, ౧. ౧. ౧) అని యిట్లు స్పష్టము గను గంఠోక్తముగను జెప్పియుండెను." అనికూడ శ్రీ శాస్త్రి గారు వ్రాసినారు (చింతా—౧౦౬ పా).

ఈ మహాభాష్యము లన్నియు నిదివఱకుఁ బాణి నీయపరిశోధనములో విపులముగా విమర్శింపఁబడి శ్రీ శాస్త్రిగారి వాదము నవి యేమాత్రము నంగీకరింపవని నిరూ పింపఁబడినది శ్రీశాస్త్రిగా రీ యనుబంధములో వాని మాట యే తలపెట్టకపోవుటచే దానిని వారు సంపూర్ణముగా నంగీ కరించిరని యీ విషయమును ముచ్చటింపక వదలుచున్నాను. కవులకుఁ బ్రమాదములు లేవను శ్రీశాస్త్రిగారు కావ్యము లలో నపశబ్దములు కలవని మనఃపూర్వకముగా నంగీకరింపక పోయినను పై వ్రాఁతలను విమర్శించునప్పుడు కావ్యములలో విరివిగా నపశబ్దములు కలవనక తప్పదు. కవులపశబ్దముల ప్రయోగించిననేగదా శాస్త్రిగారు 'కావ్యములలో నపశబ్ద ప్రయోగము దోషాపాదకము కా దని మహాభాష్యమునుబట్టి సమర్థింపఁ జూచిరి. "ఒకభాష కొక వ్యాకరణము రచించిన నది యన్యూనానతిరిక్తముగా నుండవలయును. అట్లు కాని నాఁ డాభాష కది లక్షణ మనఁదగదు" అని శ్రీశాస్త్రిగారే అనుచున్నారు (చూ. అనుబంధము. ౫ పా) కావ్యభాషను సాకల్యముగా (అనఁగా—ఒక శబ్దము నైనను విడువక యన్నిటిని సాధువులుగా) సాధించెడి వ్యాకరణ మిప్పుడు

రచింపఁబడవలసియున్నదని వాదించుచున్నవారును వీరే. కావ్యభాషలో విరివిగా నపశబ్దములున్నప్పుడు దాని కొక వ్యాకరణ మన్యానతిరిక్తముగా వీరు రచింపవలసివచ్చినప్పుడు వీరి వ్యాకరణ మపశబ్దములను సాధుశబ్దములుగాఁ జేయఁజాలినదనుటకు సందేహ మక్కఱలేదు గదా! సాధుశబ్దానుశాసనమున కేర్పడిన వ్యాకరణము నేఁటి కపశబ్దానుశాసకముగూడ నైనప్పుడు లోక మాశ్చర్యపడుట సహజము గాదా!

---

## విచిత్రము

"అపాణినీయ ప్రయోగము లనేకములకుఁ గాశికాకారుఁడును, వామనుఁడు మున్నగువారును నెందఱో సాధుత్వాంగీకారముతో సూత్రించి యుండలేదా? అట్టి పనియే పూర్ణముగా ననఁగా మఱింత విశాలముగా జరపుట యావశ్యకమని మాత్రమే గదా నాచెప్పినమాట. ఈమాత్రమున కంతగా వింతగొననేల?" (అనుబంధము. ౮ పే).

అనుబంధములో శ్రీశాస్త్రిగారి వ్రాఁతలు నామీఁద దోషము నారోపించుట కిట్లు మాఱవలసివచ్చినను మూలగ్రంథములోని వ్రాఁత లొకింత పరికింతము "సంస్కృత వ్యాకరణవ్యాఖ్యాత లనేకు లిట్టి మునిత్రయము వారి యభిప్రాయములను బాటింపక పాణినీయమునే కావ్యభాషానుశాసకముగ నంగీకరించుచు... ...వచ్చిరి. నిజముగా నట్టి వ్యాఖ్యానములు వక్తృతాత్పర్యవిలక్షణము లగుటంజేసి

యాదరణీయములు గానేర వనుటకు సందేహము లేదు (చిం
తా. ౧౦౯ పొ).

ఇఁక నిట విచిత్ర మేమియో శ్రీ శాస్త్రిగారికి విశదపఱచెదను. వ్యాఖ్యాతల వ్యాఖ్యానము లాదరణీయములు కావని పైని శాస్త్రిగారు వ్రాసిరి గదా ! ఇట్టి వ్యాఖ్యాతలలో వామనుఁడును నొకఁడు. కావ్యభాషకు విలక్షణముగా వ్యాకరణము వ్రాయఁదలఁచిన శ్రీ శాస్త్రిగారి కట్టివారిమార్గమే పునరాదరణీయమా ? ఇదిగాక వామనాదు లెంతవఱకుఁ గావ్యప్రయోగములు సాధించినను పాణినీయమునకుఁ బ్రామాణ్యమిచ్చి తదనుసారముగా సాధింపఁ గడఁగిరేగాని శ్రీ శాస్త్రిగారివలెఁ బాణినీయ మే వైదికకర్మములకో యుపయోగపడవలసినదని దానిని నిరాకరించి గగనకుసుమమువలె వీరికిని లోకమునకును నప్రత్యక్షమై ప్రామాణికు లెవ్వరు నంగీకరింపని యే శిష్టవ్యవహారభాషనో యొకదానిని సృష్టించి తమవాదమునకు విరుద్ధము లగునేయంశములఁ జూపినను సం దుండవచ్చునని యనుమానప్రమాణమునే యాధారముగాఁ గొని వాదులాడఁ జూచినవారు కారు పాఠకులారా యిదియంతయుఁ జూడ శశము (కుందేటి)నే చూడక దానికి విషాణములు (కొమ్ములు) గలవని వాదించుట మీకు స్మృతికి వచ్చుటలేదా ! పాణినీయముచే ననుశాసింపఁబడుచున్న దని తా మనుచున్న భాషాస్వరూప మెట్టిదో తా మెఱుఁగరఁట. ఇఁక నాభాషకుఁ బాణినీయ మనుశాసక మని మాత్రము వీరు నిర్ణయింతురఁట. ఈ వాద మెంతవఱకు సమంజసమో బుద్ధిమంతు లగుమీ రూహింపక పోరు. వీరివాదమునకుఁ బ్రమాణము లని యుదాహరించిన

మహాభాష్యాదులు వీరికే ప్రతికూలములై యున్నవి. "పృషోదరాదీని యథోపదిష్టమ్" అనుసూత్రభాష్యమునకు శ్రీశాస్త్రిగారు వ్రాసినయర్థము పూర్వాపరసందర్భశూన్యము గానున్నది. ఈ మహాభాష్యమునుబట్టి 'శిష్టవ్యవహారభాష' యొకటి యుండెనని వీ రేనాఁటికిని స్థాపింపఁజాలరు ఇది యంతయు నిదివఱకు సంపూర్ణముగాఁ జర్చింపఁబడిన దగుటచేఁ జర్వితచర్వణముగా వ్రాసి పాఠకుల విసిగింపను ఇఁకఁ బ్రకృతమనుసరింతము. హేమచంద్రుఁడు - జగన్నాథుఁడు - క్షేమేంద్రుఁడు - విశ్వనాథకవిరాజు - భోజరాజు - మొదలగు వారెందఱో లక్షణకర్తలగు మహాకవులు కలరు. వీరు తమలక్షణగ్రంథములలోఁ బాణినీయమునుబట్టి కాళిదాసాదిమహాకవిప్రయోగములు తప్పులని యొకచోటను నొప్పులని మఱియొకచోటను వ్యాఖ్యానించియున్నారు. ఇట్లు లక్షణకర్తలు కావ్యకర్తలు నయినవారి సంఖ్య కవిశాఖలోఁ జాలవఱకు వ్యాపింపఁగలిగినది. వీరిలో నొక్కొక్కమహాకవి వ్రాసినమహాకావ్యము లనేకములు వీ శేయేల ? మతసంస్థాపకు లగు వేదాంతదేశికాదులు నయితము మహాకవులే వీరందఱును దమవ్యాఖ్యానగ్రంథములలో నక్కడక్కడ మహాకావ్య ప్రయోగముల నుదాహరించుచు స్పష్టముగాఁ బాణినీయసూత్రములచే నవి తప్పులనియు నొప్పులనియు వ్యాఖ్యానించినవారే. ఈ విమర్శనమునుబట్టి వీరందఱును గావ్యభాషానుశాసకము పాణినీయమని తలఁచిరనుటకు సందేహము లేదు. మహాకవులగు వీరందఱును బొరపడినారని శ్రీ శాస్త్రిగా రనుచున్నారు. వీరు కవులన్న, సంగతి శ్రీ శాస్త్రిగారు మఱచిరా లేక యీకవుల

వాఙ్మయమంతయు శ్రీ శాస్త్రిగారి సిద్ధాంతప్రకారం మీర్పడిన కావ్యభాషకుఁ జెందినది కాదా. శ్రీ శాస్త్రిగా రపాణినీయము లనుచు నేమహాకవుల ప్రయోగముల నుదాహరించిరో యించు మించుగా నాకవులకాలముననే లాక్షణికులగు మహాకవులు గలరు. కావ్యభాషాసృష్టికర్తలగు మహాకవులే మేము 'పాణినీయము కావ్యభాషానుశాసక'మని తలఁచి తదనుసారముగా మాకావ్యములను వ్రాసినా మనుచుండఁ గవులు పాణినీయము ననుసరించినవారుకారు - పాణినీయమునకంటె విలక్షణమగు, వ్యాకరణమొకటి కావ్యభాష కీనాఁడు వ్రాయఁబడవలయును అని శాస్త్రిగా రనుట విచిత్రముగాదా !




Printed at Ananda Press, Madras.